

# బెజవాడలో 28-వ వారం

ఆంధ్ర, రాయలసీమ, నైజాం, మైసూరు,
తమిళనాడులలో దిగ్విజయముగా
ప్రదర్శింపబడుచున్న

విజయవారి...

# పాతాళభైరవి

డైరెక్షన్
**K.V. రెడ్డి, Bsc (HONS)**





*Produced by* - **NAGI REDDI-CHAKRAPANI**

# హిందీ చందమామ
# దీపావళి
# సంచిక

---

మామూలుకంటె ఎక్కువ పేజీలతో, ఎక్కువ రేఖా చిత్రాలతో, మరెన్నో త్రివర్ణ చిత్రాలతో—చక్కటి కథలు, మనోహరమైన గేయాలు, గిలిగింతలు పెట్టే చిక్కు సమస్యలు, ఇంకా అనేకమైన అందచందాలతో, ముచ్చటయిన త్రివర్ణ ముఖచిత్రంతో

## హిందీ చందమామ
దీపావళి (నవంబరు) సంచిక

★

వెలువడబోతున్నది. ఇన్ని ఆకర్షణలతో కూడిన ఈ ప్రత్యేక సంచిక వెల

**మామూలు 6 అణాలే**

★

మీ కాపీకోసం ఇప్పుడే మీ ఊరి ఏజంటుతో చెప్పి వుంచండి.

★

**చందమామ పబ్లికేషన్సు**

పోసుబాక్సు 1686 :: మద్రాసు 1



# డోంగ్రేగారి
## బాలామృతం

బలహీనమైన బిడ్డలకు పుష్టియున్నూ, పండ్లు మొలిచేటప్పుడు అయ్యే విరేచనములు నిలిపి, బలమును ఆరోగ్యము నిచ్చును.

K. T. Dongre & Co., BOMBAY-4



ఇప్పుడు దొరుకుచున్నది
**అమెరికన్ మోడల్ రోల్ ఫిలిమ్ బాక్సు కెమెరా**

గొప్ప పవర్ లెన్సులతోను వ్యూఫైన్డర్‌తోనూ అమర్చబడిన అత్యుత్తమమైన ఈ కెమెరా చాల చౌక. ప్రారంభకులుకూడ చక్కగ ఉపయోగించవచ్చు. నం. 120 రు ఫిలిమ్ పైన $2\frac{1}{4}'' \times 3\frac{1}{4}''$ సైజులో అద్భుతముగా ఫోటోలు ఎత్తును. ఫోటోలు తీయు విధానంతో సహా వెల రు. 9-4-0. అతి సుందరమైన రకం 11-8-0. ప్యాకింగ్, పోస్టేజిలకు రు. 1-8-0 అధనం. కెమెరాకు సరిపడు లెదర్ కేస్. రు. 3-0-0. నేడే ఆర్డరివ్వండి. ఉత్తరాలు ఇంగ్లీషులోనే వ్రాయండి.

**BENGAL CAMERA HOUSE (108 C. M.)**
P. O. 21. ALIGARH. U. P.

# మాడర్న్ థియేటర్స్‌వారి

# సర్వాధికారి




## త్వరలో వచ్చుచున్నది

డిస్ట్రిబ్యూటర్లు:

ఆంధ్ర, సీడెడ్, నైజాంలకు: ది పూర్ణా పిక్చర్సు లిమిటెడ్, విజయవాడ

# చందమామ

సంచాలకుడు : చక్రపాణి



చందమామలో వెలువడ్డ సీరియల్ కథలు కొన్ని అయినా పుస్తకరూపంగా ముద్రించమని ఎంతోమంది పాఠకులు పదేపదే వ్రాస్తున్నారు. ఈ వుద్దేశం మాకు చాలకాలంనించీ వున్నది. ఐతే ఊహని వెంటనే నెరవేర్చలేకపోవటానికి గల సాధకబాధకాలను లోగడ వివరించేవున్నాము. ఇప్పుడు మన ఆ కోరికలు నెరవేర్చుకోగల శుభసమయం వచ్చిందని తెలపటానికి సంతోషిస్తున్నాము. త్వరలోనే చందమామ తన స్వంత భవనాలలో ప్రవేశించబోతున్నది. ముద్రణాసౌకర్యాలు మునపటికంటె రెండింతలు హెచ్చుగా అమర్చుకొంటున్నది. అటువంటప్పుడు కొన్నేకాదు, సీరియల్ కథలన్నిటినీ పుస్తకాలుగా పునర్ముద్రించుకోగలము. అంతేకాదు. స్వంతభవనంలోకి వెళ్లినతర్వాత ఇప్పుడు నాలుగుభాషలలో (హిందీ, తెలుగు, అరవం, కన్నడం) వెలువడుతున్న చందమామను మరికొన్ని దేశభాషలలోకూడా వెలువరింపి, తక్కిన ప్రాంతాలవారికికూడా ఆనందాన్ని సమకూర్చటానికి ప్రయత్నాలు చురుకుగా సాగుతున్నై. ఈ దసరా, దీపావళి పండుగల సంతోష సమయంలో చందమామ తన పాఠకులకూ అభిమానులకూ అందివ్వగల శుభవార్త ఇదే.

సంపుటి 9 :: అక్టోబర్ '51 :: సంచిక 4




# మానవసేవ

ఒక్కరాత్రి బెన్ అదమ్ అను ఒక
అతనికి మెలకువ వచ్చింది.
నలుదిక్కుల ప్రశాంతి తెలివెన్నెల
పుచ్చపువ్వులా విచ్చింది.

కిటికీలోంచి అతని గదిలోనికి
కూడా వెన్నెల పడుతోంది.
నీడలు నిండిన చీకటి చెరలో
విడుదలలా గడుగిడుతోంది.

అ తెలివెన్నెల వెండివెలుగులో
ఒక దేవత అటు కూరుచొని
రాస్తున్నది ఏదో ఒక బంగరు
పాత్రం తనముందుంచుకొని.

'రాస్తున్నది ఏమమ్మా' అని ఇక
అడిగాడాదమ్ ధైర్యంగా.
'దైవసేవకుల పేర్ల' ని దేవత
మారుపలికినది స్థైర్యంగా.

'వారిలోన నా పేరుందా' అని
బెన్ అదమ్ ప్రశ్నించాడు.
దేవత పెదిమలపై దరహాసం
స్పష్టంగా తిలకించాడు.

రచన:

బైరాగి

'లేదని' దేవత అతని ప్రశ్నకు
మారు వెంటనే పలికింది.
శాంతి కాంతిగల ఆమె కనులలో
చిలిపినవ్వు ఒకటొలికింది.

'ఐనా పరవాలేదుగాని నా
పేరు మనుష్యసేవకులలో
పొందుపరుచమ్మా !' అని అదమ్
అన్నాడప్పుడు అణకువతో.

'సరే అలాగే' నంటూ దేవత
కలసిపోయినది వెన్నెలలో.
బెన్ అదమ్ ఈ జరిగిందంతా
జమకట్టేశా డొక కలలో.

కాని ఉదయమే లేచి చూడగా
పుస్తకమక్కడ పడిఉంది.
దైవసేవకుల పేర్లన్నిటిలో
అదమ్ పేరే పైనుంది.

'మానవసేవే మాధవసేవ'ని
దేవత చెప్పక చెప్పింది.
అందువల్లనే అదమ్ వైఖరి
దేవతకూడా ఒప్పింది.








ఒకానొక పిల్లవానికి పుస్తకాలు చదవడమంటే అమిత సరదా. అన్నింటిలోనూ జార్జి వాషింగ్టన్ అనే మహానుభావుని జీవితచరిత్ర అతన్ని ఎక్కువగా ఆకర్షించింది. అందులో వుండే ఈ వాక్యాన్ని అతడు కంఠస్థమే చేసుకొన్నాడు: 'బానిసత్వం పాపం కానిపక్షమందు ఈ లోకంలో పాపమనేదే లేదు.'

ఇలా ఎంతో మక్కువగా చూచుకొంటున్న ఆ పిల్లవాని పుస్తకాన్ని ఒకరోజున అతని తండ్రి తీసి, తలకింద దిండుగా పెట్టుకుని నిద్రపోతున్నాడు.

ఇది చూచి ఆ పిల్లవాని మనసుకు చాలా కష్టం తోచింది. అటువంటి అమూల్యమైన పుస్తకాన్ని తలదిండుగా ఉపయోగించటాన్ని అతడు సహించలేకపోయాడు. తండ్రిని లేపకుండా మెల్లగా వెళ్లి కూర్చుని, ఆ పుస్తకం తీసివేసి దానికి బదులుగా తన తొడను తండ్రి తలకింద పెట్టాడు.

కొంతసేపైన తరువాత తండ్రికి మెలకువ వచ్చింది. 'ఇదేమిట్రా నాయనా, పుస్తకం తీసివేశావెందుకు? ఇలా కూర్చున్నా వెందుకు?' అంటూ ఆశ్చర్యంతో ప్రశ్నించాడు. ఆ పిల్లవాడు తన వుద్దేశం వివరించి చెప్పాడు. అప్పుడు తండ్రి ఆ వుద్దేశానికి మెచ్చుకుని, 'నాయనా, నీ వెప్పటికైనా బానిసత్వాన్ని రూపుమాపి, లోకోపకారం చేయగలవాడవవుతావు' అని దీవించాడు.

అప్రకారమే పెరిగి పెద్దయాక ఆ బాలుడు—తరతరాలనుండి అతి నీచంగా అనుభవిస్తూండే నీగ్రోల బానిసత్వాన్ని నిర్మూలించటంలో తన యావచ్ఛక్తినీ ధారపోసి, జాతి జాతినంతటినీ ఉద్ధరించాడు. ఆ పిల్లవాడే—చిన్ననాట తను నేర్చిన నీతివాక్యాన్ని పెద్దతనంలో సార్థకంగా ఆచరణకు తెచ్చి, మానవసేవ చేసిన మహానుభావుడు, సుప్రసిద్ధుడు ఐన అబ్రహాం లింకన్.




అనగనగనగా, జీవా అనే ఒక కుఱ్ఱవాడు పశువులను కాసుకొని బ్రతుకుతూ ఉండే వాడు. వాడి హస్తవాసి మంచిదనీ, వాడి పోషణకింద పశువులు క్షేమంగా వుంటా యనీ లోకంలో ఒక వాడుక పడింది.

జీవా చేతిలో ఎల్లప్పుడూ ఒక పిల్లన గ్రోవి వుండేది. దానితో వాడు ఊదుతూ వుంటే మురళీకృష్ణుడు వేణునాదం చేసి నట్టుండేది. ఆ పాటకు జంతుజాలమంతా వచ్చి వానిచుట్టూ మూగేవి. అందరూ వచ్చి 'జీవా!—మరొక్కసారి వాయించవూ!' అని బ్రతిమలాడి, వినేవాళ్లు.

ఈ సంగతి పదిమైళ్లదూరాన పట్టణంలో వుండే ఒక శ్రీమంతుని చెవులబడింది. ఆ శ్రీమంతునికి పెద్ద గోవులమంద ఉన్నది. గోరక్షణ అంటే ఆయనకు అమిత సరదా. అందుకని నాడెమైన గోవు ఏ దేశంలో వున్నాసరే, ఎంత ఖరీదైనాసరే కొనితీరే వాడు. తన మందకు తగిన గోపాలుడు జీవా ఒక్కడే అని తలిచి, వాడిని రప్పించి తన గోవులమందకు పెద్దగా పెట్టుకున్నాడు.

జీవా, తన సంరక్షణలో, ఆ శ్రీమంతుని గోవులను డొక్క వెలితిలేకుండా మేపే వాడు. దగ్గరవుండి దాణా పెట్టించేవాడు. ప్రవహించే నీటిలో రోజూ వాటిని పరి శుభ్రంగా కడిగించేవాడు. వేయి కన్నులతో ఆవులను కనిపెట్టుతూ ఉండేవాడు. వాటి సతడు పేరుపేరునా పిలిచి, గంగడోలు దువ్వి మూపురం నిమిరేవాడు. 'అలివేణీ రావే!' అంటే వెల్లావు పరుగెత్తుకవచ్చేది. 'అణిముత్యమా రావే!' అనగానే పుల్లావు గంతులేస్తూవచ్చేది. ఇలానే బట్టలావు, నల్లావూ, పొట్లావూ అన్నీ అతనివద్దకు అప్యాయంగా వచ్చేవి.

ఉదయం లేగలను విడవగానే జీవా వాటిని మైదానానికి తీసుకపోయి మేతకు

సి. హెచ్. కోటీశ్వరరావు, విశాఖపట్టణం




వదిలేవాడు. తక్కిన పశువులమందల మోస్తరుగా జీవా తన అవులమందను తోలనక్కరలేదు. చేతిలోని పిల్లనగ్రతో సంజ్ఞచేస్తాడు. అవి మనసు కనిపెట్టి వాని యిష్టప్రకారం నడుచుకుంటాయి. రోజూ వాటిని మేతకు వదిలి, జీవా ఒక చెట్టెక్కి పలవలో కూర్చుండి హాయిగా పిల్లంగ్రోవి పూదుకొంటూవుంటాడు. అతడు పాడుతూ వుంటే అవి మోరలెత్తి వింటూవుంటై.

పొద్దు ఁగిపోగానే జీవా "గిలిలిలీ!... గిలిలిలీ!!...గిలిలిలీ!!!..." అని పూదేవాడు. ఎక్కడెక్కడ మేస్తూవున్న అవులూ వచ్చేసి వానిచుట్టూ మూగేసేవి. ఇంటికి చేరుకున్నాక రాత్రి పాలుపితికే సమయాన కూడా జీవా మురళి పూదేవాడు. ఉత్సాహం కొద్దీ గోవులు ఎక్కువ పాలిచ్చేవి.

ఒకరోజున జీవా గోవులను బీడుమీదికి వదిలి, చెట్టుపలవలో కూర్చునివుండగా అక్కడికి బందిపోటుదొంగల గుంపు వచ్చి పడింది. అందాలు చిందేటి ఆ గోవులను చూడగానే దొంగల నాయకుడికి కన్ను మణిగిపోయింది. 'వీటిని మన మకాముకు మళ్లించండోయ్!' అని అనుచరులకు ఆజ్ఞాపించాడు. వాళ్లు ఎంత తోలినా, బెదిరించినా, కొట్టినా మరేమిచేసినా అవులు కదలలేదు, మెదలలేదు. 'పోరా పిచ్చివాడా!' అన్నట్టుగా ఆ దొంగలవైపు ఒక్కసారి మెడయెత్తి చూచి, మళ్లీ తల వంచుకుని వాటిమానాన అవి మేయసాగినై.

ఈ సంగతి, వాళ్లు పోయి నాయకునితో చెప్పగా, అతడు ఉగ్రుడై, 'ఓరి వాజమ్మల్లారా, ఇంతేనా మీ తెలివి! వీటిని ఎవడో మంత్రంతో కట్టివేసి ఉంటాడు. ఆ మంత్రగాణ్ణి పట్టి తీసుకరండి. లేకుంటే మీ ప్రాణాలు దక్కవు!!' అంటూ శాసించాడు. అనుచరులు వణికిపోతూ, తలకొక మూలకూ పరుగులెత్తారు. వాళ్లలో తెలివైన

ఒకడు మటుకు దూరంపోలేదు. 'నిజంగా అటువంటి మంత్రగాడే ఉండేపక్షంలో వాడు ఈ చుట్టుపక్కలనే దాక్కొని వుండాలి' అని నిశ్చయించి, చేరువనుండే తుప్పలు, పొదలు, చిట్టడవులూ జాగ్రత్తగా వెతుకుతున్నాడు.

అప్పుడింతమంది దొంగలను ఎదిరించటం ఎవడితరం? అందులోనూ జీవావంటి ఒక్క కుర్రవాడివల్ల నవుతుందా? చేసేది లేక, వాడు మెల్లగా చెట్టుదిగి ఒక బొరియలో దాక్కొని, వాళ్ల చేష్టలన్నీ గమనిస్తూవున్నాడు. ఇంతలో—ఆ దగ్గరనే వెతుకులాడుతున్న దొంగవాడి కుక్క మనిషి చడి పసికట్టి మొరిగింది. అందు కని, వాడు అక్కడనే నిలిచి, జాడ కనుక్కొని జీవాను పట్టివేశాడు. వాణ్ని తీసుకవెళ్లి నాయకుని ఎదట పెట్టగానే, అతడు కత్తి ఝుళిపిస్తూ "అరేయ్, మాతో రారా, మంత్రం విప్పేసి మందను మరలించు. లేకుంటే ఖబడ్దార్!!" అంటూ భయపెట్టాడు. పుట్టెడు దుఃఖంతో జీవా, పిల్లనగ్రర వూదుకొంటూ తన గోవుల మందను దొంగల మకాముకు మరలించాడు. అక్కడ వాళ్లు ఆవులమందను




ఒక దొడ్డిలోకి తోలిపెట్టి, జీవాను ఒంటరిగా మైదానంలో వదిలేశారు.

దొంగలు మకాంచేరుకోగానే, ఇటువంటి గొప్ప గోవులమందను సంపాదించాము కదా అని నాయకుడు ఉప్పొంగిపోయి, 'భేష్!—బాగానేవుంది. బలిష్ఠమైన ఆ బట్టావును కొట్టి ఇవాళ విందు చేయండోయ్!' అని ఆజ్ఞాపించాడు. ఆజ్ఞ ప్రకారం అనుచరులు ఆవును కొట్టి, పసందుగా వండి వడ్డించి, ఇక ఆరగించుదామనుకుంటున్నారు.

ఇంతలో ఒక చిత్రం జరిగింది. అక్కడ మైదానంలో ఉండిన జీవా ఒక చెట్టెక్కి

కూర్చుని, మామూలుగా పిల్లనగ్రోవి వూదుకుంటున్నాడు. అతడు 'గిలిలిలీ!... గిలిలిలీ!!...గిలిలిలీ!!!...' అని పాడగానే దొడ్డిలోవుండే గోవులన్నీ అమాంతంగా పలుపులు తెంపివేసుకున్నై. గోడలు పడగొట్టినై. జీవాచుట్టూ మూగి, పాట వినసాగినై.

నాయకుని మకాంలో—అనుచరులు స్వహస్తాలతో వండి వడ్డించిన గోమాంసం ఒక్కళ్ల విస్తరిలోనూ కనపడలేదు! అదృశ్యమైపోయింది!! ఆ బట్టావును చంపిన ఆనవాళ్లుకూడా ఎక్కడా కనిపించలేదు. అందరూ ఆశ్చర్యపోయారు. వెంటనే ఆ పాట వినవచ్చే దిక్కుకి పోయి చూడగా, మైదానంలో చెట్టుమీద జీవా, వానిచుట్టూ పాట వింటున్న గోవులమందా అగపడినై. ఇంకా పరిశీలనగా చూచేసరికి వారు చంపి విందుచేసుకోబోయిన ఆ బట్టావుకూడా పాట వింటూ, జీవా ప్రక్కనే వున్నది!! అందరూ నిశ్చేష్టులయ్యారు.

దొంగల నాయకుడు జీవాకు పాదాక్రాంతుడై, "ఓయీ పిల్లవాడా!—నువు సామాన్యుడవుకావు. నిజంగా మంత్రగాడివే. ఆ గోపాలకృష్ణుడివే. నీ చేతిలోది వట్టి పిల్లనగ్రర కాదు. ఆ మురళీకృష్ణుడు గానంచేసే మహిమగల వేణువే!!! మేము చేసిన దుర్మార్గానికి మమ్మల్ని మన్నించు. మరెన్నడూ నిండుజీవుల ప్రాణాలు తీయబోము. బుద్ధివచ్చింది, మన్నించు" అంటూ వేడుకొన్నాడు.

నాయకుడు చెప్పిన ఈ మాటలలో ఒక్కటీ అమాయకుడైన జీవాకు తెలియనే తెలియలేదు. అందుచేత జవాబేమీ చెప్పలేకపోయాడు. వాళ్లు వదిలిందే చాలునను కుని మళ్లీ తన మందను మరలించుకుని ఇంటికి చేరుకున్నాడు.






## 16

[రాకొమా ర్తెలను రాక్షసుడు మూగిగా చేసి అరణ్యంలో వదిలేశాడు. ప్రతాపరాజు వచ్చి చూచి, వాళ్ళను తీసుకపోయి కాపాడుతున్నాడు. వారి ఆస్థాన చిత్రకారుని సహాయంతో ఉదయనుడు ఒక కాపలావాని వేషం వేసుకొని, పాతాళ గృహంలోకి పోబోగా, ద్వారం వద్ద సింహాలు వానిమీద ఉరికినై. తోడిపనివాళ్లు వాటినిచంపి, వానిని రక్షించారు. రాక్షసుడు గర్జిస్తూ ఉదయనునివద్దకు రావటం వరకు చదివారుకదూ? ఆతరువాత—]

రాక్షసుడు పెడబొబ్బలు పెట్టాడు. "ఎవడురా ఈపని చేసిందీ?" అంటూ వాడు తనవేపు రావటం చూచి ఉదయనుడు గజగజలాడిపోయాడు. ఏదో జవాబు చెబుదామనుకునేటంతలో రాక్షసుడి పరిచారకులు ఒక్క పరుగున వచ్చి అక్కడ చేరుకున్నారు. సింహాలను చంపినవాడు చేతులు కట్టుకు నిలబడి "నేనేబాబయ్యా, ఈ పని చేసింది. మన భవనంలో ఉంటూ మన చేతికింద పెరుగుతూ అవి మనల్నే మాటు వెయ్యజూచాయండి. నేనేగనక సమయానికి అదుకోకపోయినట్టయితే ఈపాటికి పాపం, వాడు యమలోకానికి పోయేవాడే" అని విన్నవించుకున్నాడు.

అందుకు రాక్షసుడు "ఆఁ, అలాగా! మాంచి పనిచేశావు. ఈసింహాలకు కొంచెం కొవ్వెక్కినట్టుంది. తక్కినవాటికి ఒక వారంరోజులపాటు కడుపు ఎండకట్టండి, అవే దారికొస్తయ్" అంటూ అక్కడి నుంచి చరచర వెళ్లిపోయాడు. అప్పటికి గాని ఉదయనుడికి ప్రాణాలు కుదుటబడ లేదు. ఏమీ ఎరగనట్టు పడుకున్నాడేకాని, రాక్షసుడు ఎటు పోయిందీ ఒకకంట కని పెడుతూనే వున్నాడు ఉదయనుడు.



హాలు చివర ఒక పెద్ద ద్వారంవద్దకు వెళ్లి, రాకసుడు మొలలోనించి చిన్న తాళపుచెవి ఒకటి తీసి ఏదో మంత్రం చదివాడు. మంత్రం చదవటం పూర్తి అయే సరికి ఆ చిన్న తాళపుచెవి కాస్తా ఏడు అడుగుల పొడుగున పెరిగిపోయింది. అప్పుడు రాకసుడు దానితో ఆ ద్వారం తలుపులు తెరిచి లోపల ప్రవేశించాడు.

ఉదయనుడు అలోపల ఏమున్నదో లేచి వెళ్లి చూదామనుకున్నాడు. కాని, పట్టు బడిపోతే ప్రాణాలు దక్కవే? అందుకని ఏమి జరిగేదీ జాగ్రత్తగా కనిపెడుతూ అలానే పడుకుండిపోయాడు.

మరి కాసేపటికల్లా రాకసుడు బయటికి వచ్చి, యథాప్రకారం తలుపు మూసి వేశాడు. మళ్లీ మంత్రం ఉచ్చరించేసరికి తాళపుచెవి తిరిగి చిన్నదయిపోయింది. అది బొడ్డులో దోపుకొని రాకసుడు వచ్చిన దారినే పాతాళగృహంలోంచి బయటకు వెళ్లిపోయాడు.

మిగతా పరివారం తిరిగి ఎవరి చోట్లకు వారు వెళ్లి గుర్రుకొట్టి నిద్రపోసాగారు. ఈ అదునులో ఉదయనుడు మెల్లగా లేచి, రాకసుడు తెరచి మూసిన పెద్ద ద్వారం వద్దకు వెళ్లాడు. తాళపుచెవి దూర్చే బెజ్జం లోనించి తొంగిచూచాడు. చూడగా ఉదయనుడు తనకళ్లను తానే నమ్మలేకపోయాడు. ఎందుచేతనంటే తను ఎవరికోసమైతే తపించిపోతున్నాడో ఆ గెడ్డపువాడు అక్కడ తలక్రిందుగా వ్రేలాడతీయబడి వున్నాడు. సంధ్యానిశీధులు మాత్రం లేరు.

ఇది చూచేసరికి ఉదయనుడికి భయమూ ఆశ్చర్యమూ కలిగినై. సోదరు లేమైనట్లు? గెడ్డపువాడిని కలుసుకోకలిగితే తెలుస్తుందేమో? కాని ఆ తాళపుచెవి లేకుండా లోపల ప్రవేశించటం ఎలా? ఏమీ పాలుపోయిందికాదు.

అలాగే కొంతసేపు ద్వారంవద్ద నిలబడి ఎంతకూ ఏమీ తోచక, అతను విసిగివిసిగి తన చోటుకు వచ్చి పడుకున్నాడు. పడుకున్నాడే కాని నిద్ర పట్టితేనా? ఆ గది ప్రవేశించటం ఎలాగ? గెడ్డపువాడిని కలుసుకోవటం ఎలా? సోదరులు ఏమయ్యారు? రాత్రంతా ఇదే ఆలోచన.



తెల్లవారింది. రాత్రి కాపలా కాసిన ఋట్టు తిరిగి పాతాళగృహం చేరుకున్నారు. వాళ్లు రావటంతోటే యిక్కడవున్న కాపలా వాళ్లు కొలనుకు బయలుదేరి పోయారు.

'ఆ' గదిలోకి ప్రవేశించే మార్గం మరేమైనా వుందేమో పరిచారకులను అడిగి తెలుసుకుందామా అని ఒక ఆలోచన కలిగింది ఉదయనుడికి. కాని వెంటనే ఒక సందేహంకూడా కలిగింది. ఈప్రశ్న అడగ్గానే తన మాయవేషం బయల్పడుతుందేమో! తను పట్టుబడిపోతాడేమో!! అందుచేత ఉదయనుడు ఆ ఆలోచన అంతటితో కట్టిపెట్టివేశాడు.

ఒక వారంరోజులకల్లా రాక్షసుడు తిరిగి వచ్చాడు. మునపటిలాగానే మొలలోనించి తాళంచెవితీసి మంత్రంవేసి పెద్దదిచేశాడు. గది తలుపులుతెరిచి లోపల ప్రవేశించాడు. ఉదయనుడుకూడా వానితోపాటు యుక్తిగా వాకిలి దాటి లోపల అడుగు పెట్టాడు. వాకిలికి ప్రక్కగా మనిషి నిలువుకు సరిపడే మూడు పెదపెద్ద బానలూ, వాటిపైన మూతలు వున్నై. మొదటిదానిపైన వున్న మూత తీశాడు ఉదయనుడు. దానిలో ఎవరో మనిషి వున్నట్టు కనుపించింది. గబుక్కున మూసివేశాడు. రెండో బాన తీసి చూచాడు. అందులోనూ అలాగే. అదీ మూసివేశాడు. మూడవబాన చూచాడు. ఖాళీగా వుంది. గుట్టు చప్పుడుకాకుండా దానిలోదిగి మూతవేసేసుకు కూర్చున్నాడు. ఇదంతా జరుగుతున్నప్పుడు రాక్షసుడు

ఎక్కడకు పోయాడో ఏమో ఉదయనుడికి తెలియనే తెలియదు.

మరికాసేపటికి రాక్షసుడు ఆ బానల దగ్గిరికి వచ్చాడు—'ఒకటీ...' అని అరుస్తూ మొదటి బానమీద మూత ఎత్తాడు. లోపలనున్న మనిషి లేచి నిలబడ్డాడు. రాక్షసుడు వాడిని జుట్టు పట్టుకుని బైటికి లాగాడు. తర్వాత 'రెండూ' అంటూ కేకపెట్టి రెండో బానమీద మూత ఎత్తాడు. దానిలోనున్న మనిషికూడా లేచి నిలబడగా వానినికూడా జుట్టు పట్టుకుని ఎత్తి బైటికి లాగాడు. వాళ్లని వెంటబెట్టుకుని గది బయటకు వచ్చేశాడు. తలుపులు ఎప్పటిలా మూసి తాళంచెవి మొలలో దోపుకొన్నాడు. వాళ్ల నిద్దరినీ చెరోగుప్పిటిలో పట్టుకుని పాతాళగృహంలోంచి బైటికి వెళ్లిపోయాడు.

ఉదయనుడు ఏమాత్రమూ ఆలస్యం చెయ్యలేదు. వెంటనే బానమూత ఎత్తి పైకి రాబోయాడు. కాని దిగటమంత తేలికగా కనపడలేదు పైకి రావటం. ఒక్క ఎగురు ఎగిరాడు. పైకంటా ఎగరలేకపోయాడు. బాన అంచు కాలికి తగిలి, దానితో సహా క్రిందపడ్డాడు. పడీ పడటంతోటే బాన ముక్క ముక్కలైపోయింది.



ఇలా ఉదయనుడు బయటపడ్డాడు. మరికొద్దిదూరంలోనే వ్రేలాడుతున్న గెడ్డపువాడు కనుపించగా, ఒక్క పరుగున వాడి దగ్గిరికి వెళ్లాడు. "ఇదేమిటయ్యా ఈ శిక్ష? నా సోదరులు ఏమైనారు? చెప్పు. రాక్షసుడు రాకముందే నేను పోవాలి. చెప్పు. త్వరగా చెప్పు" అని తొందరపెట్టాడు ఉదయనుడు.

ఉదయనుడు మారువేషంతో వచ్చాడని గెడ్డపువాడు ఇట్టే గ్రహించాడు. "నువ్వేనటోయ్! గాభరాపడకు. వాడు యింకోవారం రోజులకుగాని రాడులే. ముందు నా కట్లు విప్పు చెబుతా" అన్నాడు.

గెడ్డపువాడికట్లు విప్పాడు ఉదయనుడు. బంధం విడగానే గెడ్డపువాడు యిలా చెప్ప సాగాడు—

"నువ్వు ఈలోపలకు రావటం, బానల మీది మూతలు తీసి చూడటం అంతా నేను గమనిస్తూనే వున్నాను. ఆ రెండు బానల లోనూ నీవు చూసిన మనుషులు ఎవరనుకున్నావు? వాళ్లే నీ సోదరులు. ఇంకా నయం, వాడు మూడో బానమీది మూత తియ్యలేదు. తీసినట్టయితే నీ గతి ఏమయ్యేదో" అని యింకా ఏమో చెప్పబోతుండగా ఉదయనుడు అడ్డుతగిలి:




"ఏమిటీ? వాళ్లు నా సోదరులా! సంధ్యా నిశీధులా!! ముందు వాళ్లని విడిపిద్దాం పద" అని వేగిరపెట్టాడు.

గెడ్డపువాడు విరగబడి నవ్వుతూ, "ఓరీ పిచ్చితండ్రీ! వాళ్లు యింకా వాటిలో వున్నారనుకుంటున్నావా? 'ఒకటీ, రెండూ' అని వాడు పిలవటం వినిపించలేదూ? వాళ్లని ఆ బానలలోంచి పైకి లాగి తనతో తీసుకొనే పోయాడు" అన్నాడు.

"ఎక్కడికి?" అన్నాడు ఉదయనుడు.

"నాకూ తెలియదు. బహుశా వాళ్లని ఆ కొలనులో వదిలి కాపలావాళ్లకు వప్పజెప్తాడోయేమో" అన్నాడు గెడ్డపువాడు.




"సరే కాని, ముందు ఈసంగతి చెప్పు: ఎందుకు నిన్ను యిలా తలక్రిందుగా వ్రేలాడదీశాడు? ఎందుకోసమని వాళ్లని ఆ బానలలో పెట్టాడు? అనాడు మిమ్మల్ని ఈ పాతాళగృహంలోకి తీసుకువచ్చిన తర్వాత ఏంజరిగింది?" అని ప్రశ్నించాడు ఉదయనుడు.

అప్పుడు గెడ్డపువాడు "ముందు పగిలిన ఆ బానముక్కలు దాచేసెయ్యాలి. తర్వాత మిగతా విషయాలు చెబుతాను" అంటూ వెళ్లి ఆ ముక్కలన్నీ ఎత్తాడు. తర్వాత గెడ్డపువాడు యిలా చెప్పసాగాడు: 'నీవు ఎక్కడికి పోయిందీ మాకు తెలిసి వుండికూడా మేము దాస్తున్నామనీ, ఆ సంగతి వెల్లడించేవరకూ మమ్మల్ని నానా యాతనా పెడతాననీ బెదిరించాడు. అయితే మేము ఏమాత్రమూ సందివ్వలేదు. అప్పుడు వాడు మా ముగ్గురినీ ఆ మూడు బానలలోనూ పెట్టి బంధించాడు. అప్పటికీ నేను రహస్యం బైటపెట్టకపోయేసరికి నన్ను యిలా వ్రేలాడతీశాడు. అయినా నేను మొండిగా నీ సంగతి నాకు ఏమీ తెలియనే తెలియదని చెబుతూ వచ్చాను. నన్ను చేసినట్టుగానే వాళ్లనికూడా వ్రేలాడదీస్తాడనుకున్నాను. కాని అలా చేసినట్టు కనబడదు. మరి ఎక్కడకు తీసుకుపోయాడో, ఎందుకు తీసుకుపోయాడో నాకూ బోధపడటంలేదు" అన్నాడు.

తర్వాత ఉదయనుడు తను ఎలా మాయవేషం వేసుకుని అక్కడికి చేరుకున్నదీ సాంతంగా తెలియజేస్తూ భస్మాలూ, అంజనాలూ మొదలైనవి పోగొట్టుకున్న సంగతికూడా చెప్పాడు.

అంతా విని గెడ్డపువాడు, "వాటిని ముమ్మాటికీ ఆ రాజే కాజేసివుంటాడు. ఏదో ఒక ఉపాయంచేత యిక్కడినుంచి బైటపడి మళ్లీ ఆ రాజుదగ్గిరికి పోయి వాటిని

తిరిగి సంపాదించే మార్గం చూడాలి"
అన్నాడు. అదే ప్రకారం గెడ్డపువాడూ ఉదయనుడూ కలిసి యోచన చెయ్యసాగారు.

* * *

ఇది యిలావుంచి—అక్కడ మాళవదేశ రాజు ఐన ప్రతాపుని కోటలో మన రాకుమార్తెలు ముగ్గురూ ఎలా వున్నారో ఒక్కసారి చూదాం:

ఉదయనుడు యిక రేపు వెళ్లిపోతాడనగా ఆ రాత్రి అతడు గాఢమైన నిద్రలో ఉండగా చూచి ప్రతాపుడు భస్మాలూ, అంజనాలూ కాజేసి ఏమీ ఎరగనట్లు వూరుకున్నాడు. మర్నాడు ఉదయనుడు వెళ్లిపోగానే తనే స్వయంగా రాకుమార్తెలను చేరబిలిచి, అంజనాలూ భస్మాలూ ప్రయోగించి వాళ్ల అంగవైకల్యాలు పోగొట్టాడు. ఇప్పుడు వాళ్లు స్వస్వరూపంలో కనబడగానే వాళ్ల అందాలు చూచి తన్మయుడైపోయాడు.

'నన్ను వివాహం చేసుకోండి!' అని రాజు వాళ్లను కోరాడు. రాకుమార్తెలు ఒప్పలేదు. ప్రాధేయపడ్డాడు. లాభం లేకపోయింది. బెదిరించి చూచాడు. ఉహుఁ అన్నారు. ఇక యిది పనిగాదని "చేసుకుంటానంటే సరేసరి, లేదా ఒప్పుకొనే వరకూ మీరు కారాగారంలో ఉండవలిసిందే" అంటూ వాళ్లని బంధించివేశాడు. తలవని తలంపుగా ఈ అవాంతరం వచ్చి పడేసరికి రాకుమార్తెలు తిరిగి దుఃఖంతో కుమిలిపోసాగారు.




*

ఇక రాక్షసుడు వెంటపెట్టుకువెళ్లిన సంధ్యా నిశీధుల సంగతి ఏమైందీ అని?—వాళ్ల ఇద్దరినీ కొలనువద్దకు తీసుకువెళ్ళాడు. "ఆఖరుసారిగా మీకు అవకాశం యిస్తున్నా. మీ సోదరుడు ఎక్కడికి పారిపోయాడో యిప్పుడైనా నిజం చెప్పండి. లేకుంటే

మరొక్క క్షణంలో మీపుచ్చెలు ఎగిరిపోతై" అంటూ గండ్రగొడ్డళ్ళతో సిద్ధంగావున్న భటులను చూపించాడు.

సంధ్యా నిశీధులు ఒక్క క్షణం అలానే నిలుచుండిపోయారు. అప్పుడు నిశీధుడు— "అయ్యా! వాడు ఎక్కడికి పోయిందీ మాకూ తెలియదు. కాని యిక్కడినుంచి బైటపడితే ఎలాగో తిప్పలుపడి వాడిని వెతికి కలుసుకోగలమనే ఆశ నాకున్నది. కనుక మా మాటమీద నమ్మకముంచి మమ్మల్ని విడుదలచెయ్యి. త్వరలో నా సోదరునితో సహా తిరిగి వస్తాము" అన్నాడు.

"ఓహో, బలే పాచిక వేశావే! నీ దొంగవేషాలు నాదగ్గిర సాగవు. ఇదివరకు చేసిన మోసాలన్నీ మరిచా ననుకొన్నావా? నీవిక్కడకు తిరిగి వస్తావని నమ్మక మేమిటి?" అన్నాడు రాక్షసుడు.

అందుకు నిశీధుడు, సంధ్యనిచూపుతూ "ఐతే వీడిని నీదగ్గిరే బంధించి వుంచుకో. నీకోసం కాదనుకో, తోటి సోదరుని వదులుకోగల మనుకున్నావా? అతణ్ణి రక్షించుకొటానికైనా మేము తిరిగి నీ దగ్గిరికి రాక తప్పదుకదా?" అన్నాడు.

"సరే, మరొక విషయం. ముఖ్యంగా నేను నీసోదరుని పట్టాలంటున్నది ఎందుకో తెలుసా? ముఖ్యమైన భస్మాలూ, అంజనాలూ అతనివద్ద వుండిపోయాయి. అవి అతనివద్ద వున్నంతవరకూ నాకు నిద్ర పట్టదు. కనుక అతనే రానక్కరలేదు. నీవైనాసరే ఆ భస్మాలూ అవీ తెచ్చి నాకు వప్పగిస్తే చాలు. ఏనాడైతే ఆ పని చేస్తావో ఆనాడే ఈ నీ సోదరునికూడా విడుదలచేసి వేస్తాను,తెలిసిందా!" అన్నాడు రాక్షసుడు.

సంధ్యకూడా ఈపద్ధతికి ఒప్పుకున్నాడు. నిశీధుడు బయలుదేరాడు. మిగతా హంసలతోపాటు సంధ్యని కొలనులో వుంచమని చెప్పి భటులకు వప్పగించి రాక్షసుడూ వెళ్ళిపోయాడు. —[ఇంకా వుంది]






మొఘల్ చక్రవర్తి ఐనటువంటి అక్బరు ఫాదుషాకు అబుల్ ఫజుల్ అనే అంతరంగికుడు ఉండేవాడు. అబుల్ ఫజుల్ చక్రవర్తికి కుడిభుజమన్నమాట. అతనెంత చెబితే అంత ఆయనకు.

ఒకరోజున, ఫాదుషా మాంచి సంతోష సమయంలో ఉండగా చూచి, అతడు ఇలా విన్నవించాడు: "దేవరా!—మన ప్రభుత్వంలో అంతా చక్కగానే సాగిపోతున్నది. ప్రజంతా సుఖంగావుంటున్నారు. 'అక్బరు చక్రవర్తివంటి దయాశీలుణ్ణి మరెక్కడా చూడబోము. వారి రాజ్యంలో జన్మించటం మన అదృష్టమే' అని పిన్నాపెద్దా చెప్పుకొంటూవున్నారు. ఈవిధంగా ఏలికను కీర్తికాంత వరించటం బాగానే వుంది కాని..." అని వూరుకున్నాడు.

"సంశయించక చెప్పవోయి ఫజుల్!" అని తొందరపెట్టాడు ఫాదుషా. అంతట అబుల్ ఫజుల్ మళ్లీ అందుకున్నాడు: "ప్రభూ!—అబ్బాయిగారు సలీము, మన కొలువులోని నాట్యకత్తె ఐన అనార్కలీపైన మక్కువ కలిగివున్నట్టు తెలిసింది. ఆమెను పెళ్లాడదలచినట్టుకూడా రూఢివార్త తెలియవచ్చింది. ఈ మాటే నిజమయితే ప్రభువువారికి ఎంత అప్రతిష్ఠ! ఇంతవరకు సంపాదించిన కీర్తి అంతా నిమిషంలో మాసిపోతుందే! పైగా, ఇటువంటి కులహీనురాలిని కట్టుకోవటం వంశానికే మచ్చ తెచ్చుకోవటమవుతుందే! అదీగాక, ప్రజ తిరుగుబాటు చేస్తారో యేమోకూడా! ఈ సమస్యతో నా హృదయం తల్లడిల్లిపోతున్నది ప్రభూ!" అంటూ మనసులోని అవేదన వెల్లడించాడు.

తీవ్రంగా ఆలోచించాడు, అక్బరు. "ఫజుల్!—నీ మాటలు నమ్మ వీలుగాకున్నవి. చెప్పు చేతలలో ఉండే చిన్నారి

పి. భాస్కరరామమూర్తి - మంగళగిరి



సలీముపైన ఇటువంటి నిందను ఎవరు వేశారో? పిల్లవాడి స్వభావం నేనెరుగనా? ఐనా, నీమాట కొట్టివేయలేను. నిజానిజాలు నేను తేలుస్తాలే. మా క్షేమంకోరిన నీవు, ఈలోపల, కుర్రవానిని తగురీతిగా మందలిస్తూవుండు" అని చెప్పాడు.

* * *

మరునాడు రాత్రి దర్బారులో గొప్ప నాట్యప్రదర్శనం. ఆ ప్రదర్శనానికి అక్బరు చక్రవర్తి స్వయంగా ఏర్పాట్లు చేశాడు. తన సింహాసనానికి ఎదుట కుమారుని స్థానం. కుమారుని సింహాసనానికి పైన ఒక నిలువుటద్దం అమర్పించాడు. నాట్యకత్తె చేసే చేష్టలన్నీ చక్రవర్తికి ఆ అద్దంలో స్పష్టంగా కనబడుతై. ఈ పరమరహస్యం ఆయన ఒక్కడికే తెలుసు.

ప్రదర్శనం ప్రారంభమైంది. అనార్కలి వచ్చి, సభకు నమస్కరించింది. నమస్కరించేటప్పుడే ఆమె ఈ చిత్రమైన యేర్పాట్లు అన్నీ గ్రహించివేసింది. పాదుషాకు ఎదురుగా ఉండి నాట్యం చేయవలెనేకాని, వెన్నుచూపటం మర్యాదకు లోపం. ఈ సంప్రదాయం తెలిసిన అనార్కలి చాలా మెలకువతో మసులుకొచ్చింది.

అనార్కలి నాట్యం చేస్తూవుంటే ప్రతివారూ ఊగిపోయారు! చక్రవర్తి తన్మయుడయ్యాడు!! ఆమె ఎంతసేపూ ప్రభువువైపే తిరిగి నాట్యంచేస్తున్నది కాని, తనకు పంచప్రాణాలూ ఐనటువంటి సలీమువైపు ఒక్కసారైనా ఇంతవరకు చూడలేదు.

ప్రదర్శనం పూర్తి కావచ్చింది. చిట్టచివర, గిరగిర తిరిగే నాట్యభంగిమను అత్యద్భుతంగా చూపుతున్నది. అలా తిరిగేటప్పుడు ఆమె సలీంకు మతాబీవెలుగులాంటి ఒక్క చిరునవ్వు విసిరింది. ఆ చిరునవ్వును ఒక్క సలీమే అందుకోగలిగాడు.

దీనిని అక్బరు మాత్రమే కనిపెట్టగలిగాడు. మరి బ్రహ్మకైనా ఈ సంజ్ఞ తెలియదు.

* * *

ఫజుల్ చెప్పిన వార్త అక్షరాలా నిజమైంది. ఇక యిప్పుడు గత్యంతరం ఏమిటా అని అలోచించాడు చక్రవర్తి. అబుల్ ఫజుల్‌చేత అనేకవిధాల చెప్పించాడు సలీంకు. ఎంతచెప్పినా 'ఈ విషయంలో నా మనసు మారదు. లావణ్య, నాట్యరాణి ఐన అనార్కలీని తప్ప మరెవ్వరినీ పెళ్లాడను' అని అతడు కచితంగా చెప్పివేశాడు. ఇక బలవంతపెడితే గోడు చెడుతుందనే జంకుతో అబుల్‌ఫజుల్ ఊరుకున్నాడు.

అక్బరు చక్రవర్తికి ఈ విషయంలో పట్టుదల హెచ్చి ఈసారి ఫజుల్‌ను అనార్కలివద్దకు రాయబారిగా పంపించాడు. అతడు వెళ్లి "అమ్మా!—సలీమ్‌ను నీవు పెళ్లాడటంవల్ల రాజ్యమంతా తలక్రిందులైపోతుంది. మనసు మార్చుకో. ఇష్టమొచ్చిన మరెవ్వరినైనా వరించు. నీవు సలీమ్‌ను పెళ్లాడితే ఎటువంటి ఐశ్వర్యం పొందగలనని ఆశిస్తున్నావో, అదంతా నేను నీకు సమకూరుస్తాను" అని ఆమెకు ఎంతగానో నచ్చజెప్పాడు.



అందుకు అనార్కలి "ఓయి, మంత్రీ! సలీముఐశ్వర్యానికి ఆశించి నేను అతనిని కోరలేదు. ఏనాడో అతడు నా హృదయంలో చోటుచేసికొన్నాడు. ఏనాడో నేనతనికి అంకితమైపోయాను. కనుక అతనికోసం ఎటువంటి త్యాగమైనా చేస్తాను. ఈ విషయంలో నామనసు మారదు" అని తన నిశ్చయాన్ని వెల్లడించింది.

దయామయుడని పేరుపొందిన అక్బరు చక్రవర్తి ఈ సందర్భంలో కర్కశహృదయుడైనాడు. కొడుకునకు ఆమెను ఎడముగా ఉంచితే పరిస్థితులు చక్కబడుతవనే ఉద్దేశంతో అనార్కలీని తనతోలా హెూరుకు తీసుక

పోయి, అక్కడ ఆమెకు శాయశక్తులా బోధించాడు. ఆమె మనసు మారలేదు.

అనార్కలీ నిలబడివున్నది. ఫాదుషా ఆజ్ఞ అందుకొని గబగబ పనివాళ్ళు వచ్చారు. ఆమెచుట్టూ ఇటుకలతో గోడకట్టి, ఆమెను పాదాలవద్దనించి పూడ్చుకొంటూ వస్తున్నారు. గోపురం మోకాళ్లవరకు వచ్చింది. "ఏమి, మనసు మార్చుకొంటావా?" అని అడిగాడు చక్రవర్తి. 'ఊహుఁ' అన్నది అనార్కలి చిరునవ్వుతో. కట్టడం నడుము వరకు వచ్చింది. మళ్లీ అడిగాడు అక్బరు. మళ్లీ అలానే సమాధానం చెప్పింది ఆమె. ఒకొక్క ఇటుకవరస పూర్తి ఐనప్పుడల్లా 'ఇప్పుడైనా మనసు మారిందా' అని అక్బరు అడుగుతూనే వచ్చాడు. అప్పటికీ ఆమె సంతోషంతోనే 'లేదు, నా మనసు మారలేదు, మారదు' అనిజవాబుచెప్పింది.

గొంతువరకు వచ్చేసింది కట్టడం: మళ్లీ ఒకసారి 'ఏమి! ఇప్పుడైనా మనసు మార్చుకొంటావా, లేదా!' అని అడిగాడు అక్బరు. మళ్ళీ అలానే బదులు చెప్పింది ఆమె. కట్టడం నోటివరకు వచ్చాక ఆఖరు సారి అడిగేశాడు అక్బరు. అందుకు అనార్కలీ 'ఎన్ని జన్మలకైనా సలీమే నా నాథుడు!!!' అన్నది సంతోషవదనంతో. భటులకు సంజ్ఞచేసి అక్బరు వెళ్లిపోయాడు. తక్షణమే మరి రెండు వరుసలు పేర్చి పనివాళ్లు గోపురం మూసివేశారు!

అంతా ఐనతరువాత, అనార్కలి జీవసమాధి కాబడిన వృత్తాంతం సలీముకు తెలియవచ్చింది!!—తీరని పరితాపంతో నిండిపోయింది సలీము హృదయం. ఇక నిప్పుడు చేయగల దేమున్నది? ఆ మట్టునే అబుల్‌ఫజుల్‌ను చంపించివేశాడు. తిరుగుబాటు చేశాడు. గద్దెయెక్కాడు. తన ప్రేమనిధానమైన అనార్కలీ పేరుతో ఒక అందమైన ఆరామం నిర్మించి అందులో అపురూపమైన భవనం కట్టించాడు.






# వ్యత్యాసం

ఒకప్పుడు దేవతలందరూ సభచేసి, భూలోకమందు మానవులు ఎలా మసులుకొంటూవున్నారో వారి మంచిచెడ్డలు తెలుసుకుని, తగినట్టుగా సత్కరించాలని తీర్మానించారు. ఈ కార్యం నిర్వహించుటకు రావటం వరుణదేవుని వంతు వచ్చింది.

వరుణదేవుడు మంచిరోజు చూచి, విమానంవంటి ఒక మేఘాన్ని వాహనంగా చేసుకుని ఒక ముసిలి బిచ్చగాని రూపుతో భూలోకానికి బయల్దేరాడు.

వెళ్లి వెళ్లి అర్ధరాత్రివేళ చిన్నగ్రామం చేరుకుని, ఒక యింటి తలుపు తట్టాడు. ఆ యింటి ఇల్లాలు లేచివచ్చి తలుపు తీసింది. "అయ్యో తాతా! ఇంత రాత్రప్పుడు ఇలా చలిలో దేవులాడుతున్నావే, పాపం! లోపలకు వచ్చి పడుకో. ప్రొద్దుటే లేచి పోదుగాని..." అంటూ ఎంతో ఆప్యాయంతో ఆదరించింది.

తాత లోపలకు వెళ్లగానే సోలి పోయాడు. నోటమాట రాలేదు. ఇది చూచి ఆమె 'ఓహో, ఈ ముసిలివాడు ఏదో దారి తప్పి ఇలా వచ్చాడు పాపం. తిండితిప్పలు తిన్నట్టుగా కూడ లేదు' అని జాలిపడింది.

నిజానికి ఆ యింటివారు ఏమంత కలవాళ్లు కారు. కష్టంతోనే కాలం వెళ్లబుచ్చుకోవలసివచ్చేది. గృహయజమాని గ్రామాంతరం పోయివున్నాడు. ఏ నిమిషాన భర్త వస్తాడో అని ఆమె రోజూ వంటచేసి సిద్ధంగావుంచేది. ఇప్పుడామె తాతను లేవదీసి, తగిన ఉపచారాలు చేసి, తేరుకోగానే, భర్తకోసమని ఉంచిన భోజనం కాస్తా అతనికి వడ్డించింది.

తాత స్థితి చూడగా చూడగా ఆమెకు గుండె చెరువైపోయింది. అతని వంటిమీద గుడ్డ ఉండటం పేరుకేగాని, అన్నీ చింపులే! 'అయ్యో, నా తండ్రీ!—ఇదేమి గుడ్డ,

యస్. జానకీమణి - భీమవరం




ఇదేమి లోకం! చలిమాట దేవుడెరుగు, మానమైనా కాపాడుకోవద్దా ?' అంటూ, గబగబ గదిలోకి పోయి, మూట విప్పి, భర్తకున్న ఒక్క పంచెనూ పత్రుమని చింపి 'ఇదే వున్నది తాతా. నీవు కట్టుకుంటావో, కప్పుకొంటావో. ఇంతకంటె నేనేం చేసేది!' అని చెబుతూ నీరసంతో వేలాడిపోయిన ఆ ముసలివానికి ఆ గుడ్డ చుట్టబెట్టింది.

ఇదిగాక భర్తకు చిరుగుల బనియను ఒకటున్నది. కుట్టి బాగుచేసి అదికూడా ఈ దిక్కులేనివానికి ఇద్దామనుకుని ముందు పడవేసుకు కూర్చున్నది. ఆ కుట్టుపని పూర్తిచేసేటప్పటికి బళ్ళున తెల్లవారింది. నిద్ర లేకుంటే పోయె, అనుకున్న పని పూర్తి ఐందికదా అని ఆమె తృప్తిపడింది.

బనియను తాతకిచ్చి 'తాతా!—ఇది తొడుక్కో. తెల్లవారిందికదా. పరగడుపుతో ఇప్పుడు ఎక్కడికి పోగలవు. ఒక్క నిమిషం అగు, వేడిగంజి వారుస్తాను. అది కాస్త పొట్టలో పోసుకుని నీదారిన నీవు పోవచ్చు' అన్నది. అలానే ఎంతో ఆదరంతో గంజి కాచింది, పోసింది. తరవాత ఒక చుట్ట ముక్కకూడా యిచ్చింది. తాత చాలా సంతోషించాడు. దానినతడు బోసినోటపెట్టి, ముట్టించి మెల్లగా పొగ వదులుతూ "అమ్మా!—నీ చేతిచలవవల్ల నాకు ప్రాణం చేరుకున్నది. మరి, వెళ్ళివస్తాను. చల్లని తల్లివి, నీకొక్కమాట చెప్పిపోతా, నేను వెళ్లగానే ముందుగా నీవు ఏ పనైతే ప్రారంభిస్తావో, సూర్యాస్తమానం వరకూ అదే పని చేస్తూ ఉంటావు," అంటూ గుమ్మం దాటి నాలుగడుగులు వేసి, అదృశ్యమైపోయాడు.

తాతను సాగనంపి ఇంట్లోకి వచ్చేసరికల్లా ఆమెకు రాత్రి తను చింపిన భర్త పంచె సంగతి జ్ఞాపకం వచ్చింది. చింపగా మిగిలిన ఆ పంచె ఇంకా ఎంత పొడవున్నదో, మగనికి అది చుట్టబెట్టుకోవటాని

తయినా సరిపోతుందా లేదో అని, మూరతో కొలవబోయింది.

చిత్రమేమిటోగాని, అలా ఆమె మూరతో కొలుస్తున్న కొద్దీ పంచెగుడ్డ అక్షయమవుతూ వచ్చింది. వంటపనికి పోదామంటే పంచె ఎంతకూ తరగటం కనిపించదు. అలా ఆమె కొలిచిన గుడ్డ ఇల్లంతా నిండిపోయి, సూర్యాస్తమానమయేసరికల్లా ఆగింది. భర్త ఊరినించి రాగానే ఆమె చిత్రమంతా చెప్పింది. వారు ఆ వస్త్రం అమ్మి బోలెడంత సొమ్ము గడించి, సుఖంగా కాలక్షేపం చేయసాగారు. త్వరలోనే ఈ వార్త ఊరంతటా పాక్కిపోయింది.

పొరుగింటి పుల్లమ్మ ఊరుకోక, ఆ యిల్లాలిని తరిచి తరిచి అడిగి వివరాలన్నీ తెలుసుకున్నది. తెలుసుకొన్నప్పటినించీ 'మన యింటికికూడా ఎవరన్నా అతిథులు వస్తే బాగుండును' అని మనసులో ఆరాట పడజొచ్చింది. అనుకొన్నట్టుగా కొద్ది రోజులకే పుల్లమ్మగారింటికికూడా ఒకనాటి అర్ధరాత్రివేళ ఒక ముసలివాడు వచ్చి తలుపు తట్టాడు.

తయారులోనేవున్న పుల్లమ్మ గభీమని లేచి తలుపు తీసింది. తెచ్చిపెట్టుకున్న



ఆప్యాయంతో "రండి తాతగారూ!— రండి,' అని పిలిచి వానిని లోపలకు తీసుకపోయింది. అతడు అడక్కపోయినా ఘనంగా వున్నట్టు నటించి భోజనం వడ్డించింది. సరీగా ఇరుగు యిల్లాలు చేసినట్టుగానే చేయాలనే ఆత్రంతో 'అయ్యో పాపం!' అంటూ తాతను చూచి జాలిపడి భర్తపంచెలో ముక్క చింపియిచ్చి, 'ఇది కప్పుకొని పడుకోవయ్యా తాతా! ప్రొద్దుటే పోదువుగాని' అన్నది.

ఇంతలో తెల్లవారింది. 'అమ్మా!— నే వెళతాను' అన్నాడు తాత. 'అదేం మాట, కొంచెం కడుపు చలవచేసుకు మరీ

పోదుగాని తాతా! వంట్లో నీరసం ఉండదు' అన్నది పుల్లమ్మ, ఎంతో అపేక్ష ఉన్నట్టు. ఇరుగమ్మ మోస్తరుగా తనుకూడా వేడిగంజి కాచి తాతకు పోసింది.

మొదటి యిల్లాలికి చెప్పినట్టుగానే, తాత ఈమెతోకూడా 'అమ్మా! నీచేతి చలవవల్ల నాకు ప్రాణం చేరుకున్నది. మరి, వెళ్లి వస్తాను. చల్లని తల్లివి, నీకొక్క మాట చెప్పిపోతా: నేను వెళ్లగానే ముందుగా నీవు ఏ పనైతే ప్రారంభిస్తావో, సూర్యాస్తమానంవరకూ అదే పని చేస్తూ ఉంటావు' అంటూ నాలుగడుగులు వేసి ఇదివరకు లాగానే అదృశ్యమైపోయాడు.

పుల్లమ్మ గబగబ గదిలోకి పోయి, తాతకు తను చింపి యిచ్చిన భర్తపంచె కొలుద్దామనుకుంది. కాని అంతలో పశువులకు దప్పివేసి ఒకటే గోలగా అరవసాగినై. 'తొట్టిలో నీళ్లు పోసేసి వాటి పీడ వదుల్చుకుందాం. ఇక రోజల్లా నిశ్చింతగా కూర్చుని అదేపనిగా గుడ్డ కొలుచుకోవచ్చు' అనుకుంది పుల్లమ్మ.

అనుకుని, నూతివద్దకు వెళ్లి చేదవేసి తోడటం ప్రారంభించింది. తొట్టె నింపివేసి పోదామనుకుంటే, చేతినించి చేద వదలందే! దేవుడా అంటూ ప్రొద్దుతిరిగే వరకూ ఆమె అలా నీళ్లు తోడుతూనేఉంది! ఆ నీటితో కుడితితొట్టె మాత్రమే కాకుండా ఇల్లూ వాకిలీ నిండిపోయింది. అంతేకాదు, ఆ వీధివీధంతా బురదబురద ఐపోయేసరికి అందరూ ఆవిడమీదికి దెబ్బలాటకువచ్చి తిట్టిపోయారు. ఏమైతేనేం!—చేతులు పీకేటట్టు నీళ్లు తోడిపోయటం, నిష్కారణంగా ఊళ్లోవాళ్లచేత చీవాట్లు తినటం పుల్లమ్మకు తప్పనిసరి ఐంది.

దేవుని దృష్టిలో అందరూ ఒక్కటే. అందరనూ సమభావంతోనే సత్కరిస్తాడు. ఐతే ఫలితాలుమటుకు ఎవరి గుణగణాలనుబట్టి వాళ్లకు కలుగుతుంటై.






పూర్వకాలమందు చీనాదేశంలో 'చాంగ్' అనే ఒక పేదపిల్లవాడు ఉండేవాడు. వాడు నివసించే ప్రదేశం కొండలమయం. ఆ కొండలలో ఒకదానిమీద చిత్రవిచిత్రమేదో ఉన్నదని ప్రజలు చెప్పుకొనేవారు. అందు కని చాంగ్ ప్రతిరోజూ విడవకుండా ఆ కొండలమీదికి షికారు పోయేవాడు.

అలా తిరగ్గా తిరగ్గా కొంతకాలానికి, ఒక పర్వతంమీద ఒక గుహ కనిపించింది. దానికి బ్రహ్మాండమైన రాతితలుపు మూత వేయబడివున్నది. అది తెరుచుకునే విధం ఏమిటా అని ఆలోచిస్తూవుండగా మనిషి మసిలిన అలికిడి ఐంది. తప్పుకొని దూరంలోఉండి చాంగ్ గమనించసాగాడు.

అంతలో ఒక వృద్ధుడు అక్కడకు వచ్చి 'కైకూ వచ్చాడు, తలుపు తెరూ!' అని మూడుసార్లు అన్నాడు. తలుపు తెరుచుకుంది. లోపల ప్రవేశించాడు. కొంతసేపటికి తాత బయటికివచ్చి, 'కైకూ వెళుతున్నాడు, తలుపు మూసుకో!' అన్నాడు. వెంటనే మూసుకుపోయింది. తాత తన దారిన తను వెళ్లిపోయాడు.

తాత కనుమరుగు కాగానే, ఆత్రంతో కనిపెట్టుకునివున్న చాంగ్ గుహవద్దకు వచ్చి 'చాంగ్ వచ్చాడు తలుపు తెరూ!' అని తనపేరు పెట్టి మంత్రం పఠించాడు. కాని తలుపు తెరుచుకోలేదు. అన్నట్టు తాత మూడుసార్లు ఉచ్చరించివున్నాడుకదా అనే సంగతి గుర్తుకువచ్చి, మరి రెండుసార్లు పఠించాడు. గభీమని తలుపు విడింది.

ఉత్సాహంతో చాంగ్ లోపల ప్రవేశించాడు. అది ఒక అగాధమైన గుహ. గుండ్రంగా వున్నది. చుట్టూ గోడవున్నది. ఎటుచూచినా నిరామయం. అక్కడ ఆరు గుట్టలు గుహకు చుట్టూవున్న ప్రాకారానికి అంటిపెట్టుకునివున్నై. మరో గుట్ట ఆ

జి. సారంగపాణి - తంజావూరు



ప్రదేశానికి నట్టనడుమ వున్నది. చాంగ్ ఇక్కడకు చేరుకునేసరికలా ఒక పాలరాతి ఫలకం కనిపించింది. సరదాకొద్దీ దాని మీద కాలు వేయబోయేసరికి జర్రుమని జారిపడ్డాడు. కాని చిత్రమేమిటో కాని, కాలు తగిలీ తగలగానే ఆ గుట్ట గిరగిర తిరుగనారంభించింది !

చూస్తూవుండగానే ఆ గుట్ట పాతాళానికి క్రుంగిపోయి, అంతమేరా ఒక పెద్ద రంధ్రం ఏర్పడింది. చాంగ్ కు ఇప్పుడు కుతూహలం మరింత ఎక్కువైంది. ఆ రంధ్రం లోపలకు దిగటానికి వీలుగా చక్కటి మెట్లు అమర్చబడివున్నై. ఆ మెట్ల వెంబడే చాంగ్ గబగబ దిగేశాడు. కిందికంటా దిగగానే మరివక పెద్దా ద్వారమూ, దానికి బ్రహ్మాండమైన కొయ్యతలుపూ కనబడినై.

ఈ ద్వారంవద్దకూడా చాంగ్ మునపటి లాగానే ముమ్మారు మంత్రం పఠించేసరికి కొయ్యతలుపు తెరుచుకుని దారిచ్చింది. తలుపు తెరుచుకోగానే గొప్ప వెలుగు కానవచ్చింది. ఆ వెలుగు వింతగొలిపే కిరణాలతో నిండివున్నది. ఒక్కొక కిరణం ఒక్కొక రంగుగా వున్నది. కిరణాలు భూమి మీద పడినప్పుడల్లా రంగులు మారిపోతూ చూడటానికి అద్భుతంగా వున్నై.

తనివితీరా ఈ కిరణాలూ రంగులూ చూచి చూచి, చాంగ్ నాలుగడుగులు వేసే టప్పటికి మరిఒక ద్వారం కనపడ్డది. దీనికీ ఒక తలుపు అమర్చబడి ఉన్నది. ఇది లతలతో అల్లిన చిత్రమైన తలుపు. మళ్లీ చాంగ్ మంత్రం పఠించాడు. తలుపు తెరుచుకుంది. లోపలకు వెళ్లగానే ఒక రమణీయమైన తోట కనిపించింది. ఆ తోట కని విని యెరుగని పక్షిజాతులతో, వృక్ష సమూహంతో, జంతుజాలంతో, పుష్పవాటి కలతో నిండివున్నది. ఇవన్నీ చూచినకొద్దీ మరలిపోదామంటే మనస్కరించిందే

కాదు. కాని ఒకవంక ఆకలిబాధ. మరొక వంక ఎవరన్నా వచ్చి పట్టుకుంటారేమో నని భయము! అందుచేత జాగ్రత్తగా మంత్రాలు పఠిస్తూ, ద్వారాలు మూడూ మూసివేసి, బయటపడి, చాంగ్ ఇంటిదారి పట్టాడు.

* * *

ఇంటికి చేరుకున్న చాంగ్, తను చూచి వచ్చిన తమాషాలన్నీ పూసగుచ్చినట్టు వాళ్ల నాయనమ్మకు వినికిడి చేశాడు. నాయన మ్మంటే చాంగ్‌కు ప్రాణం. ఆమే వానికి సమస్తమున్ను. కనుక, ఆమెతో చెప్పకుండా ఎలా ఉండగలడు? అన్నీ విని ముసలిది 'నాయనా! నాకూ చూపించవటరా ఆ వింతలూ?' అని ఎంతో ఆప్యాయంగా అడిగింది. ఎన్నడూ ఏమీ అడగని ఆమె అలా కోరటమే చాలు. మాట తీసివేయ గలడా మనుమడు?

మరునాడు చాంగ్ ముసలమ్మను వెంటబెట్టుకుని బయల్దేరాడు. 'నాయనమ్మా! లోతైన గుహలూ అవ్వీ కనిపిస్తాయి. జడుసుకోబోకు' అని అవిడకి ముందుగానే చెప్పిపెట్టాడు. మంత్రాలు పఠించి ఒకొ క్కటిగా ద్వారాలు తెరిపించాడు. గుట్టలు,




మెట్టలు చూచి ముసలిది భయపడింది. కాని ముందే తెలిసిఉండటంవల్ల ఆమె గుండె నిబ్బరం చేసుకుంది. ఐతే రంగుకిరణాలు చూడగానే మాత్రం ఆమె కన్నులు జిగాలు మని తన్మయురాలైంది. తర్వాత తోటలో ప్రవేశించి సృష్టిచిత్రాలన్నీ చూచేసరికి, ఆమె ఆశ్చర్యానికి మేరలేకనేపోయింది.

అంతా ఐనాక చాంగ్ మరలుముఖం పట్టాడు. నాలుగడుగులు వేసి వెనక్కు తిరిగి చూస్తే ముసలమ్మ కనిపించలేదు. గుహ అంతా గాలించాడు చాంగ్. కేకవేసి పిలిచాడు. ఏమి చేసినా పత్తా దొరకలేదు. కంగారుతో ఇంటికి పోయాడు. అక్కడా




లేదు. మళ్లా గుహకు వచ్చాడు. పిచ్చివాని లాగా అటు యిటు తిరుగులాడుతున్నాడు. ఏమీ తోచక మళ్లీ ద్వారంవద్దకు పోయాడు. మంత్రం పఠించాడు. కాని ఎన్నిసారులు పఠించినా ఈసారి తలుపు తెరుచుకోలేదు. చాంగ్‌కు భయం పట్టుకున్నది.

అంతలో—మొదటిరోజున కనుపించిన తాత—కైకూ—చాంగ్‌కు ప్రత్యక్షమయ్యాడు. 'అబ్బాయీ! మీ నాయనమ్మ ఇంక నీకు దొరకదు. ఇప్పుడు నీవు దొంగతనంగా ప్రవేశించినట్టుగానే గుహలో మరెవళ్లూ ప్రవేశించకుండా ఆమెను కాపలా పెట్టుకున్నాను. పో, వెళ్లిపో' అని కసిరాడు.

అందుకు చాంగ్ 'తాతా!—నాయనమ్మ నా ప్రాణం. ఆమె లేందీ నిమిషం సేపైనా నిలవలేను. నన్ను విడిచి ఆమె క్షణమైనా ఉండలేదు. కాబట్టి, కరుణించి ఆమెను వదిలేసెయ్యి. బుద్ధి వచ్చింది. మరెన్నడూ నీ అనుమతి లేకండా గుహలో ప్రవేశించను' అంటూ దీనంగా వేడుకొన్నాడు.

అప్పుడు తాత జాలిపడి, 'కుర్రవాడా! ఆమెను వదలటమనేది వట్టిమాట. అంతగా నీవు ప్రాధేయపడుతున్నావు గనక, ఏడాదికి ఒకసారి వచ్చి నీవామెను చూడటానికి అనుమతిస్తున్నాను. నీవనుకొన్నట్టు ఆమె నీకోసం బెంగపెట్టుకోవటం లేదు. ఇక్కడ సుఖంగానే వుంటున్నది. నీవు పట్టపురాజుకి అల్లుడివి కాబోతావని చెప్పాను. ఈ మాట విన్నప్పటినించీ ఆమె నిర్విచారంగా వున్నది' అని చెప్పాడు.

ఆశ్చర్యంతో చాంగ్ 'ఏమిటి తాతా! వేళాకోళం చేస్తున్నావా? నావంటి పేదవాడేమిటి, పట్టపురాజుకు అల్లుడు కావడమేమిటి?' అంటూ ప్రశ్నించాడు.

'అబ్బాయీ! మన నోటిమాట వృథా కావటానికి వీల్లేదు. పో, నీకెందుకు, వెళ్లిపో!' అని చెప్పి వానిని పంపివేశాడు.

తాత మాటమీద నమ్మకమున్నా లేకున్నా, చేసేదిలేక చాంగ్ ఇంటికి పోయాడు. పోయి, లెక్కగా రోజులు గడుపుతున్నాడు. ఏటా ఒకసారి గుహకు వెళ్లి నాయనమ్మను చూచివచ్చేవాడు. ఇలా వాని జీవితంలో పదహారేళ్లు గడిచిపోయినై.



* * *

చాంగ్ ఇంటి పొరుగున మరొక పేద కుటుంబం వుంటున్నది. వాళ్లు కలపకొట్టి అమ్ముకొని జీవించేవాళ్లు. పాపం, వాళ్లకు సంతతి లేదు.

ఒకరోజున ఆ యింటివాడు కలప కోసం అడవికి వెళ్లేసరికి ఒక తుప్పలో చంటిబిడ్డ యేడుపు వినిపించింది. పోయి చూడగా ఒక అందమైన ఆడశిశువు కనిపించింది. ఇదే వరప్రసాదమనుకుని ఆతడు ఆ బిడ్డను ఇంటికి తెచ్చాడు. అల్లారు ముద్దుగా పెంచుకొంటున్న ఆ కట్టెలవాని కూతురుకు యుక్తవయస్సు రాగా వాళ్లు చాంగ్‌ను ఆదరించి పిలిచి, ఆ పిల్లనిచ్చి పెళ్లి చేశారు.

చాంగూ భార్యా కులాసాగా కాలక్షేపం చేస్తూవుండగా ఒకనాడు వారింటికి ఇద్దరు వచ్చారు. ఒక చాపవేసి చాంగ్ వారిని కూర్చుండమన్నాడు. చాంగ్ భార్య దాహం తెచ్చియిచ్చింది. గుమ్మంలో అడుగుపెట్టి నప్పటినించీ ఆ కొత్తగా వచ్చినామె చాంగ్ భార్యవైపు చూస్తూనేవుంది. దగ్గరకు వచ్చి దాహం అందించేటప్పుడు మరీ పరిశీలనగా చూచింది. ఎందుకోగాని, చాంగ్ భార్య కూడా ఆమెను మొదటినించీ పరికిస్తూనే వుంది. దాహం అందించినప్పుడు మరింత పరీక్షగా చూచింది. ఇద్దరిలోనూ ఏదో చెప్ప లేని చైతన్యం కలిగింది. చాంగ్‌భార్యను ఆ వచ్చినామె అప్రయత్నంగా కౌగిలించుకుని అక్కున అదుముకున్నది!! ఇందుకు చాంగ్‌భార్య ఆశ్చర్యపడింది.

వాళ్ల ఇద్దరనూ చూచి ఆమె భర్త "ఏమిటీ, మన చిన్నారే! మన చిన్నారే !!" అంటూ పట్టరాని సంతోషంతో చాంగ్ భార్యను చేరదీసుకున్నాడు. చాంగ్‌కు ఇదేమీ అర్థం కాలేదు. అంతలోనే రాజ పరివారమంతా బిలబిలమంటూ అక్కడికి వచ్చేసింది. వాళ్లకు దంపతులు ఆ పిల్లను చూపిస్తూ, "మన అమ్మడు మనకు దక్కిందోయ్! కష్టం ఫలించిందోయ్ !!" అని అంతులేని ఉత్సాహాన్ని వెలిబుచ్చారు. అప్పుడు అవగాహనైంది చాంగ్‌కు—ఆ వచ్చిన దంపతులు రాజూ రాణీ అనీ, తన భార్య రాజపుత్రి అనిన్నీ.

అంతట రాజు చాంగ్‌ను దగ్గర తీసుకొన్నాడు. "నాయనా, చాంగ్! పన్నెండేళ్ల క్రిందట లేకలేక పుట్టిన ఈ బిడ్డకు మక్కువకొద్దీ వంటినిండుగా ఆభరణాలు పెట్టాము. దుర్మార్గులు బిడ్డనెత్తుకపోయి వస్తువులు కాజేసి పాపం, బిడ్డను నట్టడవిలో వదిలేశారు. నాటినుండీ తిండీ నిద్రా లేకండా మారువేషాలతో ఇలా బిడ్డకోసం వెతుక్కొంటూనేవున్నాము. ఏమైతేనేమి, ఈనాటికి మా కష్టాలు గట్టెక్కినై. అదృష్టవంతుల మోయ్ చాంగ్!" అని అన్నాడు.

'మీరు కాదు, అదృష్టవంతుణ్ణి నేనూ!' అన్నాడు చాంగ్ ఆనందంతో.

చాంగ్ తన నాయనమ్మను చూచి రావలసిన రోజు ఆనాడే ఐంది. అందుకని రాజదంపతులనూ పరివారాన్నీకూడా తనతోపాటు తీసుకపోయి, చాంగ్ గుహలోని వింతలన్నీ వారికి చూపించాడు. చాంగూ భార్యా ముసలిదాని దీవనలు పొందారు. చాంగ్ తాతకు నమస్కరించి 'తాతా! అప్పుడు నేను నమ్మలేకపోయాను గాని, నీ మాట అక్షరాలా ఫలించిందిసుమా!' అన్నాడు. తాత చిరునవ్వు నవ్వాడు. ఎంతో సంతోషంతో అందరూ కోటకు మరలిపోయారు.






బుచ్చిరెడ్డిపాలెంలో భూవరాహరెడ్డి అనే గొప్ప రెడ్డి ఒకాయన ఉన్నాడు. వారి ఇంటికి ఎదురింటిలో అచ్చమాంబ అనే పదేళ్ల అమ్మాయి ఉండేది. అచ్చమాంబ ఐదో తరగతి చదువుకునే పిల్ల. ఆ పిల్లకి సుమతీ శతకంలోవీ వేమన శతకంలోవీ పద్యాలెన్నో వచ్చు. ఆ పిల్ల చదివే పద్యాలన్నీ రెడ్డిగారికి వినపడి, 'ఆహా! కోకిల కంఠం! ఎంత బాగా చదువుతున్నది అచ్చమ్మ!' అని మెచ్చుకునేవాడు.

ఒకనాడు అచ్చమాంబ, వేమనశతకంలో ఒక పద్యం ఇలా చదివింది—

'ఉప్పుకప్పురంబు నొక్కపోలికనుండు
చూడ చూడ రుచుల జాడ వేరు;
పురుషులందు పుణ్యపురుషులు వేరయా
విశ్వదాభిరామ వినురవేమ.'

ఎదురుగుండా అరుగుమీద కూర్చుని దంతధావనం చేస్తూన్న రెడ్డిగారు అచ్చమాంబని దగ్గిరకు పిలిచి కూచోమని, 'అచ్చమ్మా, 'బలే బాగా చదివేవు పద్యం. దాని అర్థమేమిటో చెబుదూ?' అన్నాడు.

అందుకు అచ్చమ్మ ఆయన అడగటమే తడవుగా 'అర్థానికేముంది మామా!-ఉప్పూ కర్పూరంకూడా చూట్టానికి తెల్లగానే ఉంటాయి. నోట్లో వేసుకుంటేమాత్రం ఉప్పు కషమై ఊరుకుంటుంది. కర్పూరం అలా గాక ఘుమఘుమలాడుతో మంచి పసందుగా ఉంటుంది. అలాగే మనుషుల్లో మంచివాళ్లూ చెడ్డవాళ్లూ పైకి ఒకలాగే కనపడ్డా, వాళ్ల గుణాల్లో తేడాలుంటాయి' అని చెప్పేసింది.

'అరటిపండు వొలిచి చేతిలో పెట్టినట్లు చక్కగా చెప్పివే!' అని మెచ్చుకుంటూ రెడ్డిగారు లోపలికి వెళ్లి, చక్కెరకేళీ అరటిపళ్ల అత్తం ఒకటి తెచ్చి అచ్చమ్మకి బహుమతీగా ఇచ్చిపంపేడు.

పాలంకి వెంకటరామచంద్రమూర్తి - మదరాసు



ఆ పద్యంలోని భావం చాలా గొప్పగా ఉందనిపించింది రెడ్డిగారికి. 'పురుషు లంతా ఒకలాగే కనపడ్డా, వాళ్లలో పుణ్య పురుషులు వేరు' అని చెప్పటానికి ఎంత మంచి ఉపమానం తీసుకొచ్చాడు వేమా రెడ్డి!' అని మెచ్చుకుంటూ భూవరాహ రెడ్డి పెరట్లోకి వెళ్లేసరికల్లా అయనకి తమ కోడిపుంజులు రెండూ కంటపడ్డాయి. ఆ పుంజులకి కొంచెం దూరంలోనే పెట్టలూ వాటి పిల్లలూ తమ తమ ముక్కులతో ఆహారం ఏరుకుంటూ కనపడినై.

ఇంతట్లో రెడ్డిగారి పనిమనిషి వచ్చి రెండు పుంజులముందూ గుప్పెడేసి నూకలు జల్లి చక్కాపోయింది. పెట్టలూ పిల్లలూ బిలబిలమంటూ నూకలకోసం గుమిగూడేయి. కాని, పుంజుల్లో ఒకటి వాటిని దరికిరానియ్యక పొడిచి తరిమేసి, నూకలన్నీ తనే బొక్కటం ప్రారంభిం చింది. అవన్నీ రెండో పుంజుదగ్గిర పడ్డ నూకలకోసం అక్కడికి చేరేయి. ఆ రెండో పుంజు మొదటిదానికిమల్లే గాక వాటిని చేరనిచ్చి, వాటికి కావలసినవేవో తినిపోయే దాకా తాను వారగా నిలబడింది.

ఒక పుంజు స్వార్థంతో తక్కిన కోళ్లని దగ్గిరికి రాకుండా తరిమెయ్యటం, రెండో పుంజు వాటిని చేరనిచ్చి ఆదరించటం చూసేసరికి రెడ్డిగారికి చాలా ఆశ్చర్యం వేసింది. చూడగా రెండు పుంజులూ ఒక లాగే ఉన్నాయి పైకి! సర్వం ఒకేపోలిక! ఐతేం? గుణాల్లో మాత్రం అంతా తేడాయే!

రెడ్డిగారికి అచ్చుమాంబ చదివిన పద్యం జ్ఞాపకం వచ్చి, "పుంజులందు పుణ్య పుంజులు వేరయా విశ్వదాభిరామ వినుర వేమ" అని మార్చి చదవసాగా డాయన.

ఆ తర్వాత రెడ్డిగారు తన వ్యాపకం సందడిలో వేమన పద్యమూ, పుంజుల ప్రవర్తనాకూడా మరిచేపోయారు.

మర్నాడు ఆయన వియ్యంకుడు,— అంటే కూతురు మామగారు, పని మీద వారింటికి వచ్చారు. రెడ్డిగారి భార్య శీలమ్మ వంటమనిషితో "వియ్యంకుడు గారు వచ్చారు, కోడిమాంసంతో విందు చెయ్యాలి" అని పురమాయిస్తోంటే ఈ మాట రెడ్డిగారి చెవిని పడింది.

రెడ్డిగారు వంటవాణ్ణి పిలిచి, "ఆ చెడ్డ పుంజు పనిపట్టు!" అన్నారు.

వంటవాడికి ఈ మాటలు అర్థం కాలేదు. "పుంజుల్లో మంచీ, చెడ్డా యేమిటి?" అనిపించింది వాడికి. "ఏ పుంజుమాట బాబయ్యా తాము శెలవిస్తోంట? నా కంటికి రెండూ ఒకలాగే ఉన్నాయే" అన్నాడు.

"నడు. దాన్ని నేను చూపెడతాను" అంటూ రెడ్డిగారు వంటవాణ్ణి వెంటబెట్టుకుని పెరట్లోకి వెళ్లేరు.

రెండు పుంజులూ ఒకదానికొకటి దూరంగా నిలపడి కనపడ్డాయి. తీరా వాటిని చూసేసరికి వాటిల్లో చెడ్డ పుంజేదో "పుణ్యా"పుంజేదో రెడ్డిగారే పోల్చలేక పోయారు.

ఒక్క నిముషం ఆలోచించి, "ఒక్క గుప్పెడు నూకలు పట్టుకురావోయి వాటి



తేడా యేమిటో చెబుతాను" అన్నారు రెడ్డిగారు.

వంటవాడు నూకలు తెచ్చి పోసీపొయ్యేటంలో ఒక పుంజు బాణంలా వచ్చి నూకల్ని మింగడం ఆరంభించింది. రెండో పుంజు కూడా వచ్చి తినబోయింది. గాని మొదటి పుంజు దాన్ని దూరంగా తరిమేసి మళ్లీ వచ్చి మింగడం ప్రారంభించింది.

"ఇదేనోయ్, నేను చెప్పిన పుంజు" అన్నారు రెడ్డిగారు. దానిపని పట్టేశాడు వంటవాడు. మనసుకి నచ్చిన పుణ్యా పుంజును మక్కువగా చూచుకొంటూ వచ్చారు రెడ్డిగారు.




## 7

ఒక వూళ్లో ముగ్గురు స్నేహితులుండేవాళ్లు. వాళ్లకు జూదమాడటమే వృత్తి. ఒకరోజున వాళ్లు ఆట ఆడగా, అందులో యిద్దరు గెల్చుకున్నారు, మూడవవాడు ఓడిపోయాడు. ఓడిపోవటమే కాదు. చేతిలో డబ్బులేక, తక్కిన యిద్దరకూ బాకీపడ్డాడు. వాళ్లు ఊరుకోక, "మా సొమ్ము మాకిచ్చి మరీ కదలవోయ్" అనిచెప్పి ఆ మూడవ వాణ్ణి నిర్బంధించారు.

మూడవవాడు కేవలమూ ధనహీనుడై వుండె. చేతిలో పైసా లేదు. వీళ్ల పీడ ఎక్కువగా వున్నది. ఎలా తప్పించుకోవటమా అని యోచన చేశాడు చాలాసేపు. ఎంతకూ ఏమీ తోచక, వాళ్లు ఆదమరిచి వుండగా గుప్పెడు యిసుక తీసి, వాళ్ల కళ్లలో కొట్టి కాలికొద్దీ పరుగుచ్చుకున్నాడు.

వాళ్లు కళ్లలో యిసుక దులుపుకొని, కాస్తంత స్తిమితపడిన తరవాత, మోసం చేసిపోయిన ఆ మూడవవానికోసం వెతికారు. కాని, ఎక్కడా వాడు కానరాలేదు. వాడు పోయిపోయి ఒకతోటలో మామిడి చెట్టెక్కి పలవలో కూర్చుని వున్నాడు. ఆ చెట్టుకింద చల్లగా వుండటంచేత ఆ యిద్దరు జూదగాళ్ళు కూడా అక్కడనే చేరుకొని, విశ్రాంతి తీసుకుందామని కూర్చున్నారు. 'ఊరికే కూర్చోవడమేమిటి? ఒక్క ఆట వేసుకుందాము' అనిపించింది వాళ్లకు. ఆట ప్రారంభించారు.

ఆటవేసిన కొంచెంసేపటికల్లా రక్తికట్టి, వాళ్లకు ఆవేశం పుట్టుకొచ్చింది. ఇదంతా కనిపెట్టి చెట్టుపైనించి చూస్తూవున్న మూడవవానికి ఉన్నట్టేవుండి ఉద్రేకం కలిగింది. 'ఈ మారు ఆట నేను వేస్తానుండవోయ్!' అంటూ గభీమని చెట్టుమీదినించి కిందికి ఉరికాడు.

'దొరికాడురా దొంగ !!' అంటూ జూదగాళ్లిద్దరూ మూడవవాడిని పట్టి, కసితీరా బాగా మర్దించి వదిలారు.

## 8

నందవరం గ్రామంలో రంగయ్యా అనే సాహుకారు ఉండేవాడు. వట్టి లోభి.

ఒకప్పుడు రంగయ్యా పనిమీద పట్నం వెళ్ళవలసివచ్చింది. ఈ సంగతి తెలిసి, అతని స్నేహితుడైన సుబ్బన్న 'ఓయి రంగయ్యా! నువు వెళ్ళబోయేది బస్తీకద. పట్టణంలో వర్తకులు ఒకింటికి రెండింతలు ధరలు చెప్పి మోసం చేస్తారట. కనుక జాగ్రత్తసుమా!' అంటూ హెచ్చరించాడు. అందుకు రంగయ్య 'ఆ ఆటలన్నీ మన దగ్గిరనా!' అని ధీమాగాచెప్పి బయల్దేరాడు.

రంగయ్యా పట్టణం చేరుకుని పనులు చక్కబెట్టుకుంటూవుండగా మట్టమధ్యాహ్నమైంది. నెత్తీ కాళ్ళూ మాడిపోతున్నై. అందుకని గొడుగుల షాపులోకి వెళ్ళి, ఒక గొడుగు తీసి వెల అడిగాడు. 'పదిరూపాయలండీ బాబూ' అని చెప్పాడు, వర్తకుడు.

వెంటనే రంగయ్యా ఆలోచించాడు— 'ఒకింటికి రెండింతలుకదా చెప్పి మోసం చేస్తారని మన సుబ్బన్న చెప్పాడు. ఈ గొడుగు అసలువెల ఐదురూపాయలు ఐవుండాలి' అని అనుకుని 'ఐదురూపాయలకు ఇస్తే యివ్వండి. లేకపోతే లేదు' అన్నాడు. అలా ఇలా బెట్టుచేసి, వర్తకుడు ఎలా ఐతేనేం అంతకే వప్పుకొన్నాడు. 'వర్తకుడు ఐదు రూపాయలకు ఇస్తున్నాడంటే దీని అసలు ఖరీదు అందులో సగమే కద అయివుండాలి' అనుకుని రంగయ్యా 'అయ్యా! రెండున్నరకు ఇస్తే యివ్వు, లేకుంటే వద్దు' అని కచితంగా చెప్పాడు.

వర్తకుడికి చీకాకెత్తి 'బలే బేరగాడివయ్యా, అంతకూడా ఎందుకు, ఊరికే పట్టుకపో!' అంటూ చీదరించుకున్నాడు. అప్పుడు రంగయ్యా 'వర్తకుడు ఒక గొడుగు ఉచితంగా ఇస్తానంటే, నిజానికి అతడు రెండు గొడుగులు ఇవ్వవలిసి వుండాలి' అని లెక్కవేసి, 'అయ్యా! రెండు గొడుగులిస్తే తీసుకుంటాను కాని, ఒక్కటైతే వద్దనే వద్దు' అన్నాడు. ఈ మాటలకు అక్కడి వాళ్ళందరూ విరగబడి నవ్వారు.

సెప్టెంబరు నెల మాకు వచ్చిన చిట్టికథలలో పై రెండు కథలూ బహుమతి పొందినై.

7-వ కథ—వ్రాసినది: డి. బాబ్జీ, అనకాపల్లి—బహుమతిగా యితనికి హిందీ తెలుగుకోష్ ఒకటి పంపుతున్నాం. 8-వ కథ—వ్రాసినది: పి. సరళాకుమారి, నంద్యాల—బహుమతిగా ఈమెకు లేసు అల్లుకునే పరికరాలు పంపుతున్నాం.



# వింతదొంగలు

కాశీ నగరమందు పూర్వం కబీరుదాసు అనే రామభక్తుడు ఉండేవాడు. అతనికి కమాల్ అనే కుమారుడున్నాడు. అతడూ రామభక్తుడే. కబీరు జన్మతః పేదవాడే ఐనప్పటికీ, ఎప్పుడు ఎంతమంది సాధువులు వచ్చినా లేదనక సత్కరించేవాడు. ఇలా సత్కరించటంలో తండ్రికి తోడు నీడగా ఉంటూవచ్చాడు, కమాలుడు.

ఒకరోజున నడిరాత్రి అకస్మికంగా కబీరుకుటీరానికి ఒక పెద్ద సాధువుల గుంపు వచ్చి, "అయ్యా!—ఇక్కడ కబీరుదాసు అనే భక్తుడున్నాడట! పరదేశ సాధువులకు కడుపుచూచి అన్నదానం చేస్తాడట! వారి ఇల్లు ఎక్కడో కాస్తంత చెప్పండయ్యా!" అంటూ అరిచారు.

అప్పుడు గుమ్మంలోనే నిలబడివున్న కబీరుదాసు వారిని చూచి జాలిపడి, 'అయ్యా!—మీరు చెప్పిన ఆ కబీరును నేనే. దయచేయండి' అని చెప్పి వారిని కూర్చోబెట్టి లోపలకువెళ్లాడు. నిద్రలోఉన్న భార్య సుందరాదేవిని లేపి, 'ఇంతమంది సాధువులు హఠాత్తుగా వచ్చారే. ఏమిటి గత్యంతరం?' అని అడిగాడు.

అందుకు సుందరాదేవి 'నాథా!—ఇది పరమేశ్వరుడు మనకు పెట్టిన పరీక్ష తప్ప వేరుకాదు. మీరేమీ ఆత్రపడకండి. ఇటువంటి అవసరంలో అప్పుచేసి ఐనా, దొంగతనంచేసి ఐనాసరే ధనం ఆర్జించి భాగవతారాధన చేయవచ్చునంటారు పెద్దలు. దీని వల్ల మనకేమీ పాపం చుట్టుకోదు' అని సలహా చెప్పింది. కమాల్ కూడా ఈ మాటలు అందుకుని, 'దొంగతనం చేసిఐనా సాధు సంతర్పణ చేయవలిసిందే' అని తండ్రిని ప్రోత్సహించాడు.

ఇష్టమున్నా లేకున్నా కబీరుకు ఈ పని తప్పిందికాదు. భగవంతునిమీద భారం

యన్. వసంతకుమారి - బొంబాయి

వేసి, పెద్దవీథి మొనలో ఉండే వర్తకుని యింటికి కన్నంవేతామని తండ్రికొడుకులు బయల్దేరారు. జాగ్రత్తగా వర్తకుని ఇంటికి కన్నం తవ్వారు. అ కన్నంలోనించి కొడుకును లోపలకు పంపి, కబీరు ఇవతల నించున్నాడు.




లోపల ప్రవేశించేసరికి, శెట్టి ఇంట్లో మణికనక రత్నరాసులు కమాలుకు కన్నులు మిరుమిట్లు కొల్పినై. అయినా అతడు వాటివైపే తొంగిచూడలేదు. ఇంకా వెతుక్కుంటూ పోగా బ్రహ్మాండమైన కొట్లూ, వాటినిండుగా ఆహార సామగ్రీ కనిపించినై. ఆ పదార్థాలు తీసి కమాలు, బయటనున్న తండ్రికి అందిస్తూవచ్చాడు. కావలసిన పదార్థాలన్నీ చేరవేసికొన్న తరవాత, సంతోషంకొద్దీ కమాలు నిద్దర పోతున్న వర్తకుణ్ణి తట్టిలేపి 'శెట్టిగారూ!—సాధుసంతర్పణకోసమని అవసరమైన ఆహారసామగ్రి తీసుకుపోతున్నాను. అంతే. నీ ధనకనక వస్తువాహనాదులేమీ తాకలేదుసుమీ! ఈ మాట చెప్పిపోదామని లేపాను. నిద్ర పాడుచేశానని మరేమీ అనుకోకు' అనేసి, బిరబిర కన్నంలో దూరి పోబోయాడు.

ఈ మాటలకూ చేష్టలకూ శెట్టి అబ్బురపడి, పిల్లవాని వెంటపడ్డాడు. కన్నంలో దూరిపోతూవున్న కమాల్ కాళ్లు రెండూ గట్టిగా పట్టి వెనక్కు లాగాడు. ఇదిచూచి, అవతలఉన్న కబీరు కొడుకుతలకాయపట్టి తనవేపు లాక్కోబోయాడు. అప్పుడు కమాలు 'నాయనా!—ఇక లాభంలేదు. గుర్తు తెలియకుండా నా తల నరికి పట్టుకపో!' అన్నాడు. 'అయ్యో! తప్పి వచ్చింది కదా దైవమా!!' అని విచారిస్తూ కబీరు కొడుకుతల తెగవేసి చంకనిపెట్టుకు పరుగెత్తాడు. ఇంటికిచేరుకుని, భార్యకు ధైర్యం చెప్పి, దొంగిలించి తెచ్చిన పదార్థాలతో




గబగబ వంటలు చేయించాడు. సాధుసత్తములను పిలిచి, బంతులుగా కూర్చోబెట్టి వడ్డించి, 'అయ్యా! ఆలస్యమైనందుకు క్షమించండి. దాసుణ్ణి అనుగ్రహించండి!' అంటూ చేతులు జోడించి నిలబడ్డాడు.

* * *

ఇక్కడి సంగతు లిట్లా వుండగా, అక్కడ ఏం జరిగిందంటే—కన్నానికి అవతల వున్న కబీరు ఎప్పుడైతే కొడుకుతల తెగగొట్టి పట్టుకపోయాడో, ఆ క్షణమందే కమాలు కాళ్లు పట్టుకొనివున్న పర్తకుడు మొండెంతోసహా వెనక్కుపడి, కెవ్వుమని కేకవేశాడు. ఆ కేకకు చుట్టుపక్కల జనం లేచివచ్చారు. జరిగిన కథ చెప్పేసరికి, అందరూ ఆశ్చర్యచకితులయ్యారు.

ఈ వార్త ఒక్కనిమిషంలో ఊరంతటా అల్లుకుపోయి, రాజుగారివరకూ ప్రాకింది. రాజుకూడా ఆశ్చర్యంపొంది, 'ఔరా, నా రాజ్యంలో ఎంతెంత ఘాతుకాలు జరుగుతున్నై!' అనుకొంటూ రక్షక భటులను పిలిపించి, 'ఈ మొండెం కోటగుమ్మానికి వేలగట్టి జాగ్రత్తగా కనిపెడుతూ వుండండి. దీన్ని చూచి ఎవళ్లయితే విచారిస్తారో వాళ్లని పట్టి వెంటనే తీసుకరండి' అని ఆజ్ఞాపించాడు. ఈ వృత్తాంతం రాజ్యంలో పాక్కిపోయింది. అబాలగోపాలమూ గుంపులు గుంపులుగా కూడి, మొండెం చూచిపోయి, తలకొక విధంగా అనుకోసాగారు.

* * *

అక్కడ కబీరుఇంట ఆతిథ్యం పొందిన సాధువులు "ఓయీ!—అర్ధరాత్రనక అపరాత్రనక నీవు ఎంతో ఆదరంతో మమ్మలిని సత్కరించినందుకు చాలా సంతోషమైంది. నీవు వండి వడ్డించిన మృష్టాన్నాలతో సంతుష్టిచెందాము. భగవంతుని కృపాకటాక్షంవల్ల నీ కోరికలన్నీ సిద్ధించుగాక!" అంటూ ఆశీర్వదించారు.



ఉన్నట్టేఉండి ఆ సాధువుల గుంపునకు పెద్ద అయిన ఒక సన్యాసి 'అన్నట్టు మరిచాము. మీ కుర్రవాడేడీ!' అని అడిగాడు. అందుకు కబీరు ఏదో ఒక ముక్క అస్తవ్యస్తంగా చెప్పి తప్పించుకోజూచాడు.

ఇంతలో, వారు నగరద్వారం వద్దకు చేరుకొనేసరికి, అక్కడ మూగిఉన్న జన సమూహమూ, వారుచేసే సందడీ కంట బడింది. అప్పుడు సాధువులపెద్ద వారివల్ల సంగతి అంతా తెలుసుకొని, ఆశ్చర్యపడి "అయ్యయ్యో, ఎంత అన్యాయం! ఏ దుర్మార్గుడు ఇంతపని చేశాడో!—చేతుల మీదా ఈ మొండెము మీదా నామాలు చూడగా, కుర్రవాడు వైష్ణవదాసు డన్నట్టుగా తోస్తున్నది. బట్టకట్టు చూస్తే తురకల తీరుగా ఉన్నది. ఇటువంటి సాత్వికుడు దొంగతనానికి పోయి, నరుకుడు పడ్డాడంటే, ఇది తండ్రీకొడుకుల మధ్యనే జరిగిందని తోస్తున్నది..." అంటూ విచారింపసాగాడు.

ఈ మాటకు కబీరు ఉలిక్కిపడి 'అయ్యా!—తురకయితేనేమి? వైష్ణవుడయితేనేమి? పరోపకారంకోసం ప్రాణాలు అర్పించాడు. కనుక, వాని జన్మ సఫలమే అయిందికదా!' అన్నాడు.




అందుకు సాధువులపెద్ద వింతపడుతూ, "ఓ మొండెమా! కబీరు చెప్పినమాట సత్యమే అయితే, నీ జన్మమే ఉత్తమజన్మ కావాలె" అనగానే ఆ మొండెం 'అవునవును' అన్నట్లు చప్పట్లు చరుస్తూ, కోట గుమ్మంనుండి కిందికి దుమికి చిత్రవిచిత్రంగా నృత్యం చేయసాగింది.

ఇది చూచి జనమంతా ఆనందంలో మునిగిపోయారు. అప్పుడు ఆ కపటసన్యాసి "అవునయ్యా, కబీరూ!—నీ కీసంగతి తెలిసేవుండాలి. దాచక నిజం చెప్పు" అని నొక్కి అడిగేసరికి, కబీరు ఆయన పాదాలమీద వాలి, క్షమాపణ కోరుకుని,



రాత్రి జరిగిన కథ అంతా పొంతంగా పూసగుచ్చినట్టు చెప్పాడు.

అప్పుడు సన్యాసి ఉగ్రుడై, "ఓరీ, నీచుడా!—నీవు దొంగవే కాదు, పుత్ర హంతకుడవు, శిశుహంతకుడవుకూడా. పరమపాతకుడవైన నీ చేతి అన్నము మాచేత తినిపిస్తావా? సాధువులు ఇటు వంటి పనులు చేస్తారంటే నేను నమ్మ లేను" అన్నాడు. అయనకు నమ్మకం కలగటానికని కబీరు భార్యను ఇంటికి పంపి, దాచిన అబ్బాయితల తెప్పించాడు.

ఆ సన్యాసి ఆతల చేతబట్టుకుని ఇటూ అటూ తిప్పుతూ "ఓయీ! ఇంత చిన్నతల ఏమి? అంత లావు కళేబరమేమి? ఐనా, అమొండెమునకు దీనిని తగిలించిచూతాం' అంటూ అలా చేయగా, మొండెమునకు ఆ తల సరీగా అతుక్కుపోయింది. ఈ మహిమ చూచి, జనమంతా ఆశ్చర్య పోయారు. కమాలుడు నిద్రనుండి లేచి నట్టు లేచి. తలిదండ్రులకు ప్రదక్షిణం చేసి, నమస్కరించాడు. వారు కొడుకును చూచుకొని, మైమరచినంతలో సన్యాసుల గుంపు అదృశ్యమై, సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేతుడయిన శ్రీరామ చంద్రమూర్తి పరివారమూ సాక్షాత్క రించారు. ఆ దర్శన భాగ్యానికి కబీరూ, కమాలూ, సుందరాదేవీ అంజలి ఘటించి, వారి ఇష్టదేవుణ్ణి అనేకవిధాల వినుతించారు.

ఈ వృత్తాంతం తెలిసిన వర్తకుడు వచ్చి, కమాలు కాళ్లపైబడి—"భక్తశిఖామణీ! నేను మహాపాపిని. అపరాధం మన్నించు" అని వేడుకోగా కమాలు 'ఓయి శెట్టీ!—నీవేమీ విచారించకు. నీమూలాన్నేసుమీ మాకు శ్రీహరి దర్శన భాగ్యం కలిగింది' అని అంటూ అతనికి తారకమంత్రం ఉపదేశించాడు. నాటినుండీ వర్తకుడు తన ధనాన్ని భక్తుల నిత్యసంతర్పణలకోసం వినియోగిస్తూ మంచిపేరు పొందాడు.



# చందమామ పజిల్
(భాషాభివృద్ధికి)

అడ్డము:

1. కవిత్వము
4. నీళ్లు
6. దుఃఖము
8. మగత
9. ఒక సంవత్సరము
10. శివుడు
11. చందమామ
13. పొట్ట
14. బాణము
17. తిరిగి
18. శేషము




నిలువు:

2. ఆపద
3. ఓడ
4. శిశువు
5. ఒక నది
7. తాటాకు
12. — ఋతువు
13. తపించు
15. ఆట
16. గని

# వినోద చదరం

★

ఇచ్చిన ఆధారముల సహాయంతో ఈ క్రింది చదరంలో మీరు ఆరుమాటలు నింపాలి. సరియైన మాటలతో మీరు నింపగలిగితే అన్నిమాటలలోని చివరి అక్షరాలు ఒకేలా వస్తయ్. అంతే కాదు. ఈ ఆరుమాటలలోనూ వచ్చే మొదటి అక్షరాలను వరుసగా పైనుంచి క్రిందికి కలిపి చదివితే ఒక ముఖ్యమైన పండగ పేరు వస్తుంది.




ఆధారములు:

1. ఆటంకము
2. గెలుపు
3. కీర్తి
4. గర్వము
5. వంద
6. కలిసినది

మీకు తెలియకపోతే జవాబుకి 54-వ పేజీ చూడండి.

## 'ఆసు ఏమైపోయింది?'

ఈ తమాషా చేసి చూపించి ప్రేక్షకులను చిత్రంగా నమ్మించవచ్చు. ఈ ఆటకు ప్రత్యేకంగా తయారుచేయించిన చీట్లపేక అక్కర్లేదు. మామూలు చీట్లపేక తీసుకువచ్చి, ఐంద్రజాలికుడు అందులోని నాలుగు ఆసులను ముందు పైకి తీసి మిగతా పేక ప్రేక్షకుల్లో ఒకరికి ఇవ్వాలి. ఐంద్రజాలికుడు ఆ నాలుగు ఆసులను ఈ దిగువ చిత్రంలో చూపినప్రకారం టేబిల్ మీద పరిచి చూపించాలి. ఆ తర్వాత ఆ నాలుగింటినీ కలిపి, ప్రేక్షకుని చేతికిచ్చిన పేక అడిగితీసుకుని వాటితో కలిపివేసి మొత్తంపేక తిరిగి అతడి జేబులోనే పెట్టెయ్యాలి. "వన్-టూ-త్రీ! మీ జేబు భద్రంగా ఉంచుకోండి" అనాలి. అతడు జేబును గట్టిగా నొక్కి పట్టుకుంటాడు. "వన్-టూ-త్రీ! మీదగ్గరున్న పేకలోని నాలుగు ఆసులూ యిలాయివ్వండి" అనాలి. ప్రేక్షకుడు తీసిచూస్తే మూడు ఆసులే ఉంటాయి. కళావరు అసు ఉండదు. ఐంద్రజాలికుడు కళావరు ఆసును తన జేబులోని మనిపర్సులోంచి తీసి చూపిస్తాడు. దీని అసలు రహస్యం ఇది.

ఐంద్రజాలికుడు ముందుగానే కళావరుఆసును తీసి తన పర్సులో భద్రంచేసుకోవాలి. ప్రేక్షకులకు నాలుగు ఆసులూ చూపించేటప్పుడు కళావరు అసుకు బదులు



అయిదు బంతిని తీసుకుని అందులోని నాలుగు చుక్కలనూ మిగతా ఇస్పేటు, డైమను, ఆటీను మూడు అసులతో బొమ్మలో చూపినవిధంగా మూసిచూపించాలి. మధ్య కనుపించే ఒంటిచుక్కను చూసి ప్రేక్షకులు అదీ ఆసే అనుకుని భ్రమపడతారు. ఐంద్రజాలికుడు ఆ మూడు ఆసులనే ప్రేక్షకులకు చూపించి, వాళ్ల చేతులోని మిగతా పేక తీసుకుని దానితో కలిపేసి జేబులో దాచుకోమంటాడు. తర్వాత మళ్లీ ఆ పేక తీసి ఎంత వెతికినా, కళావరు ఆసు కనుపించదు. 'ఆసు ఏమైపోయింది? ఏమైపోయింది?' అని నలుగురూ నాలుగు వైపులనుంచీ అడగటం మొదలెడతారు. ఐంద్రజాలికుడు తన జేబులోని మనీపర్సు తీసి, అందులో దాచిన కళావరు ఆసుతీసి 'ఇదుగో' అంటూ చూపెడతాడు. భలే తమాషా కాదూ!

పాఠకులు ఈ గారడిని గురించి యింకా వివరంగా తెలుసుకోదలిచితే, వారు 'చందమామ' పేరు ఉదాహరిస్తూ ప్రొఫెసరుగారికి నేరుగా వ్రాయవచ్చు. మీరురాసే ఉత్తరాలు ఇంగ్లీషులోనే వుండాలి. ఇది అతి ముఖ్యం.

ప్రొఫెసరుగారి అడ్రసు యిది:

ప్రొఫెసరు పి. సి. సర్కార్, మెజీషియన్,
12/3/A, ఐమీర్‌లేన్, బాలీగంజ్,
కలకత్తా - 19.

## ఒంటిగీత బొమ్మ



దీనిని పంపినది:

కె. అర్ముగం, సింహళము

49 - వ పేజీలోని పజిలుకు జవాబు:

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 క | 2 వి | 3 త | | 4 పా | 5 య | ము |
| | 6 ప | రి | 7 తా | ప | ము | |
| 8 మ | త్తు | | శ | | 9 న | ల |
| | | 10 క | ప | ర్ది | | |
| 11 శ | 12 శి | | త్ర | | 13 కు | క్షి |
| | 14 శి | 15 లీ | ము | 16 ఖ | ము | |
| 17 మ | ర | ల | | 18 ని | లు | వ |

# రంగు వెయ్యండి—4.వ బొమ్మ కథ

గుహలులోని మహానుభావుడి సహాయం లభిస్తుందనికదా వచ్చాడు రాకుమారుడు? అలా గాక వ్రేలాడతీయబడటానికి తనవల్ల జరిగిన అపచారం ఏమిటో తెలియక, గత్యంతరం లేక అలా వ్రేలాడుతూ వున్నాడు. రోజులు గడుస్తున్నయ్. కాని చిత్ర మేమిటంటే: రోజుల తరబడి నిద్రాహారాలు లేకుండా అలా వ్రేలాడుతున్నా, అతని దేహం శుష్కించలేదు. ఇరవైతొమ్మిది రోజులు గడిచాయి. ముప్ఫయ్యోవ రోజున మహానుభావుడు కనువిప్పాడు. తన మాయదండం రాకుమారుడివైపు చూపి క్రిందకు దించేసరికి, ఎలా వెళ్లి అతుక్కున్నాడో అలాగే దిగి వచ్చి మహానుభావుడి ఎదుట నిలబడ్డాడు రాకుమారుడు. మహానుభావుడు ప్రశ్నించగా అతడు తను వచ్చిన పని మనవిచేసుకున్నాడు. అప్పుడు మహానుభావుడు మాయదండంతో తన ఎదుటవున్న పుర్రెని ముమ్మారు తాకి "రాకుమారుడి ప్రశ్నకి సమాధానం చెప్పు" అన్నాడు. పుర్రె యిలా పలికింది: "ఇక్కడకు పడమటిదిక్కుగా కొన్ని యోజనాల దూరం వెడితే ఒక ఎడారిప్రదేశంలో మోడువారిన ఒక వృక్షం కనిపిస్తుంది. ఆ వృక్షంపైని నివసించే పంచవన్నెల రామచిలుకని తీసుకురాగలిగితే నీ కోరిక సిద్ధిస్తుంది." ఇలా పలికి పుర్రె వూరుకున్నది. మరుక్షణమే రాకుమారుడు మహానుభావుడి ఆశీర్వాదం పొంది పంచవన్నెల రామచిలుకకోసం బయలుదేరాడు. కష్టపడి అక్కడికి చేరుకున్నాడు. ఐతే, ఆ వృక్షంపైన వున్నది పంచవన్నెల రామచిలుక కాదు. అది తెల్లటి చిలుక. చిలుకమాట అటుంచి వృక్షాన్ని ఒక బ్రహ్మాండమైన సర్పం చుట్టుకొని బుసలు కొడుతున్నది. 'మోడువారిన వృక్షాన్ని' గురించి పుర్రె చెప్పిన మాటలలో ఈ సర్పం సంగతి రానేలేదు. పైగా పంచవన్నెల చిలుకకి మారుగా తెల్లచిలుక వున్నదాయె! ఇది చూచి, 'పుర్రె చెప్పిన వృక్షం మరొకటి అయి వుంటుందా?' అని సందేహం కలిగింది. కాని బ్రహ్మాండమైన ఆ ఎడారిలో చుట్టుప్రక్కల చూపుమేర ఎక్కడా ఒక మొక్కఅయినా కనుపించలేదు. అందు చేత ఏమి చెయ్యటానికీ తోచక రాకుమారుడు అలానే మరొక రెండు రోజులు అక్కడే వుండిపోయాడు. చిత్రం!— మొదటిరోజున తెల్లగా కనుపించిన ఆ చిలుక మరునాడు నల్లదిగానూ, మూడవరోజున ఎర్రదిగానూ మారి, నాల్గవనాడు పంచవన్నెల చిలుకగా మారింది. నిరాశతో కృంగిపోయిన రాకుమారుడికి కాస్త ఉత్సాహం కలిగింది. చెట్టుకి చుట్టుకొనివున్న ఆ మహాసర్పాన్ని ఎలాఐనా సంహరించి, చిలుకని పట్టితీరాలని అతడు నిశ్చయించుకొన్నాడు. ఇదే అక్టోబరు బొమ్మ కథ.




రంగు వెయ్యండి (కథ): 5-వ. బొమ్మ

# చేసి చూడు

నలుచదరంగా వుండే ఒక కొయ్యపెట్టె తీసుకో. నీకు ఎదురుగుండా ఉండేవైపు చెక్కను ఊడదియ్యి. దీనికి మధ్యగా ఒక గుండ్రపాటి పెద్దబెజ్జం చేసి ఉంచుకో. నీళ్ళతోనిండిన ఒక గాజు గ్లాసు తీసుకొని పెట్టెలో క్రింది బొమ్మలో చూపినచోట పెట్టు. అదే పలకపైన ఐమూలగా (పక్కలకు కట్టే) ఒక అద్దంముక్క నిలబెట్టు. ఈ అద్దానికి యివతలవైపున ఒక చిన్న కొవ్వొత్తి ముక్కను వెలిగించి నిలబెట్టు. తరువాత, మొదట బెజ్జంచేసి వుంచుకొన్న చెక్కతో పెట్టెను మూసివెయ్యి. ఇప్పుడు ఈ బెజ్జంగుండా చూచినట్లయితే, కొవ్వొత్తి గ్లాసులోవున్న నీటిలో వెలుగుతున్నట్టు కనిపించి గమ్మత్తుగావుంటుంది.



ఒక తెల్లనికార్డు తీసుకుని, దానినుంచి గుండ్రగా బిళ్లఒకటి కత్తిరించు. ఆ బిళ్ల పైన, క్రింది బొమ్మలో చూపినమోస్తరుగా ముదురు నీలం సిరాతో ఒక నక్షత్రం బొమ్మ గియ్యి. ఇప్పుడు బిళ్ళను ఒక పెన్సిలు మొనపైన గుచ్చి, వేలుతో గిరగిరా త్రిప్పి చూడు. నీవు గీసిన నక్షత్రం కనుపించదు. బిళ్లలో మధ్యభాగం ముదురు నీలం రంగుగా కనుపించి, పోనుపోను రంగు తగ్గిపోయి, అంచు దగ్గరకొచ్చేసరికి తెల్లగా కనుపిస్తుంది.



---

49-వ పేజీలోని వినోద చదరానికి

జవాబు :

| | |
|---|---|
| 1. విష్ణుము | 4. దర్పము |
| 2. జయము | 5. శతము |
| 3. యశము | 6. మిశ్రము |

# దసరా - సరదా

'మహేశ్వర్' మద్రాసు



వచ్చిందండీ దసరా
తెచ్చిందండీ సరదా!
చుక్కలు, ముగ్గులు పెట్టేరూ,
అక్కలు బావలు వచ్చేరూ
పిండీ వంటలు చేసేరూ!
అక్కల కులుకులు
బావల అలకలు
కిలకిల లాడుతు
పకపక లాడుతు
పండుగ నిండుగ ఉందండీ!
దసరా వచ్చిందండీ
సరదా తెచ్చిందండీ!

* * *

బొమ్మల కొలువులు పెట్టేరూ
బొట్టూ పెట్టి పిలిచేరూ
వాలుజడలు వేసుకొనీ
తలలో పూలు పెట్టుకొనీ
పావడాలు కట్టుకొనీ
చిన్న చిన్న పిల్లలంత
వాయనాల కొస్తుంటే
దసరా దేవత లెవరో
తరలి వచ్చినట్టుంది
సరదా తెచ్చిందండీ
దసరా వచ్చిందండీ!

* * *

కొలువులనిండా బొమ్మలు
కూర్చున్నాయి నిండుగను:
బొజ్జ పెంచి షాహుకారు
చిల్లి సేరు ముందు వుంచి
తిరగవేసి కొలుస్తాడు
చిత్రమైన బొమ్మలెన్నొ
కూర్చున్నాయ్ నిండుగాను
పండుగ వేడుకలెన్నో
కన్నుల పండుగగానూ
తెచ్చిందండీ సరదా!
వచ్చిందండీ దసరా!

* * *

సందడిగా బడిపిల్లలు
గురిపెట్టిన బాణాలతొ
వడివడిగా పోతూంటే
మహిషాసుర మర్దనిని
మర్దించిన యోధులేమొ
అనిపించిందండీ
వచ్చిందండీ దసరా
తెచ్చిందండీ సరదా!

# అట్టమీది బొమ్మ

నరకుడనే రాక్షసరాజు కృష్ణునిపైన పగబట్టిన సంగతి లోగడ తెలుసుకొనే వున్నారు. వాడు పగ సాధింపబోయి, చివరకు శ్రీకృష్ణుని చేతిలో హతుడయ్యాడు. నరకుడు చనిపోగానే, వానికి ప్రాణస్నేహితుడూ, సుగ్రీవుని మంత్రి ఐన ద్వివిదుడనే వానరునికి ఉద్రేకం పుట్టుకొచ్చింది. కృష్ణ బలరాములను పరిమార్చి నరకుని ఋణం తీర్చుకోవాలని వాడు కృతనిశ్చయుడైనాడు. ఈ దుష్టసంకల్పం ఎప్పుడైతే కలిగిందో ఆ క్షణమందే బలగాన్ని వెంటబెట్టుకు పోయి ఉపద్రవకరమైన చేష్టలతో దేశం నాశంచేయటానికి పూనుకొన్నాడు. ఆ రాక్షసబలగం పట్టణాలమీదా గ్రామాలమీదా పడ్డారు. చిచ్చుపెట్టారు. కొండలు తెచ్చి విసిరారు. సముద్రాలలో నీరు ఎగజిమ్మి దేశాలు ముంచివేశారు. మహర్షుల ఆశ్రమాలలో యజ్ఞవేదికలు మైలపరిచి, హోమగుండాలు చల్లార్చారు. స్త్రీలను గుహలలో పెట్టి బంధించారు. నిందించారు.

ఇలా ఉండగా ఒకరోజున ద్వివిదుడికి రైవతపర్వతం వైపునించి కమ్మటి సంగీతం వినిపించింది. ఏమిటా చూదామని అక్కడికి వెళ్లేసరికి, ప్రియురాండ్ర మధ్యని సంగీతం పాడుతూవున్న బలదేవుడు అగుపించాడు. ద్వివిదుడు ఒక చెట్టెక్కి కూర్చుని, కొమ్మలు వూపుతూ కిలకిలా నవ్వాడు. బలరాముని ప్రియురాండ్రు వానిని ఎగతాళి చేశారు. వాడు, బలరాముడికి కనపడేట్టుగా వాళ్లను వెక్కిరించి కనుబొమ్మలాడించాడు. కొంటెపను లెన్నో చేశాడు.

బలరాముడు అలిగి పెద్ద బండ విసిరాడు. వానరుడు తప్పించుకుని బలరాముని మధుకలశం పగలగొట్టాడు. పైగా ఆడవాళ్ల చీరెలు చించివేశాడు. బలరాముడు ఉగ్రుడై, హలమూ ముసలమూ చేతపుచ్చుకొని యుద్ధానికి తలపడ్డాడు. ఇదిచూచి వానరుడు పెద్ద చెట్టొకటి పెకలించి ఒక్కపరుగున వచ్చి బలదేవునిపైన విసిరాడు. బలరాముడు దాన్ని తప్పించుకొని ముసలం విసరగా, అది వాని తలకు కొట్టుకొని మెదడు చెడిపోయింది. దెబ్బతో నెత్తురు వరదలు ప్రవహించినై. తరువాత ఉభయుల మధ్యనా వృక్షాలతోను, శిలలతోను తీవ్రమైన సంఘర్షణ జరిగింది. చివరకు వానరుడు రెండు పిడికిళ్లూ బిగించి బలరాముని రొమ్ముమీద గ్రుద్దేసరికి, ఆయన రోషపూరితుడై, నెత్తురు కక్కుకొనేలాగ ద్వివిదుని గొంతుపిసికి చంపి, లోకానికి వాడి పీడ వదిలించాడు.

Controlling Editor : SRI CHAKRAPANI
Printed and Published by B. NAGI REDDI, at the B. N. K. Press, Madras - 1

## బంగారు కవరింగ్ చేయబడిన RAJA బ్రాండు ఆభరణములు

కలదు 10 సం॥ గ్యారంటీ

NETAJI NEHRU SAIBABA PHOTO RINGS

COLOURED STONE RING Rs 2-12-0 EACH.

BABY RING Rs 1-0-0 EACH

PLAIN RING.

CUFF-LINKS Rs 1-12-0

NEHRU KRISHNA

NETAJI ETC 2-0-0

PIN 0-8-0 EACH

RAJA 265 RAJA 266 RAJA 265/1 RAJA 265/2

POSTAGE EXTRA BUTTONS EACH 0-9-0 Catalogue free on Application

**రాజా గోల్డు కవరింగ్ కంపెని మచిలీపట్నం.**

రౌండు, బాదం, కాఫీ, చంద్రహారములు, 24" యించి, పేట 1-కి రు. 11/- సాదా నల్లపూసల చైను 18" యించి 1-కి రు. 5/- ఫ్లవర్ నల్లపూసల చైను 18" యించి 1-కి రు. 7/8/- ఆర్డరుతో 800 డిజైనులుగల క్యాటలాగు పుచితంగా పంపబడును. ప్యాకింగు పోస్టేజి రు. 1 అదనము

రాజా గోల్డు కవరింగ్ కంపెనీ (రిజిష్టర్డు)

రాజా బిల్డింగ్సు :: మచిలీపట్నం

---

## సోలార్ పెన్

ఎల్లప్పుడు "సోలార్" వుపయోగించుడు

**శాస్త్రి పెన్ వర్క్సు * తెనాలి**

---

# స్విస్ గడియారములు

గ్యారంటీ 3 సం॥రములు



నె. 24 సైజు 6/12

| | | | |
|---|---|---|---|
| 5 జ్యూవెల్ క్రోం | 32/- | 7 జ్యూవెల్ క్రోం | 37/- |
| 15 ,, | 44/- | రోల్డుగోల్డు | 37/- |
| సుపీరియర్ | 39/- | రోల్డుగోల్డు | 49/- |



నె. 25 సైజు 8/12

| | | | |
|---|---|---|---|
| 5 జ్యూవెల్ క్రోం | 28/- | 7 జ్యూవెల్ క్రోం | 32/- |
| 15 ,, | 43/- | రోల్డుగోల్డు | 33/- |
| సుపీరియర్ | 36/- | రోల్డుగోల్డు | 48/- |



నె. 26 సైజు 6/12

| | | | |
|---|---|---|---|
| 5 జ్యూవెల్ క్రోం | 21/- | టైంపీసు | 20/- |
| 15 ,, | 44/- | పాకెట్‌వాచ్ | 12/- |
| రోల్డుగోల్డు | 24/- | రోల్డుగోల్డు | 54/- |
| సుపీరియర్ | 25/- | సుపీరియర్ | 15/- |

పోస్టేజి అధనం. రెండు ఒకేసారి కొన్నయెడల పోస్టేజిలేదు. ఆర్డరిచ్చునప్పుడు గడియారం నెంబరు, జూవెల్సు స్పష్టముగా వ్రాయవలెను

ఫిలిమ్ ఫ్లూట్ : ఇత్తడిది ఇంగ్లీషు ట్యూన్సు ఇచ్చును. వెల 4-0-0 పోస్టేజి 1-4-0 అధనం. ఫ్లూట్ బోధిని 1-8-0 పోస్టేజి 0-8-0 అధనం. ఉత్తరప్రత్యుత్తరాలు ఇంగ్లీషులో వ్రాయండి.

**CHHAYA VARIETY STORES (W.B.)**

**P. O. 13, ALIGARH (V. P.)**

## చందమామ

## చందాదారులకు మనవి

చందమామ ప్రతినెల, గతనెలాఖరులోనే చందాదారులకు పోస్టు చేయబడును. కాపీ చేతనిఎడల మొదటి అరుతారీఖుల లోగా తమ పోస్టాఫీసులో విచారించి, మాకు తెలియజేయాలి. 10 వ తారీఖు తరువాత వచ్చు కంప్లైంట్లు అమోదింపబడవు. గడచినమాసములలో చేతలేదనే కంప్లైంట్లు గమనింపబడవు.

## జేబు ప్రింటింగు సెట్టు (అచ్చుయంత్రం)



లెటర్ పేడ్, పోస్టు కార్డు, కవర్లు, ప్రోగ్రాములు, నోటీసులు మొదలైనవి అయిదు నిమిషములలో ఏ పేరు అయినా అచ్చు వెయ్యవచ్చు. అన్నిరకముల మొహర్లు తయారు చేసుకోవచ్చు. పరికరములతో సహా వెల రూ. 4 పోస్టేజి, ప్యాకింగు రూ. 1-8-0

### ఇంట్లో సినిమా (సినిమా యంత్రం)

యీ యంత్రముద్వారా రకరకాల రంగుల బొమ్మలు చూచి, యింట్లో కూర్చొనే సినిమా ఆనందం పొందవచ్చు. బొమ్మలతో సహా వెల రూ. 2-8-0 పోస్టేజి, ప్యాకింగ్ రు. 1. ఉత్తరప్రత్యుత్తరాలు ఇంగ్లీషులో జరపండి.

**Address: UNITED BUREAU (C.M.)**
**P. O. Hathras (India)**

---

## ముఖ్యమనవి

**ఆనంద సుధ** సమస్త జనులకు కండపుష్టిని, బలమును, చక్కని ఆరోగ్యమును కలిగించును.

8 ఔ॥ సీసా రు. 3-0-0

**స్త్రీ సుధ** స్త్రీలకు చక్కని ఆరోగ్యమును, సంతోషమును, సత్సంతానమును కలిగించును.

1 తులము రు. 4-0-0

**బాల సుధ** పసిపిల్లలయొక్క సమస్త వ్యాధులను నశింపజేయును.

50 మాత్రల సీసా రు. 1-0-0

ప్రతిషాపులోను దొరుకును.

**శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి & సన్సు,**
రాజమండ్రి.

---

## ఉమా వాచ్ గొలుసులు

లోహంపైన అసలు బంగారురేకు అంటించి తయారు చేయబడినవి. యావజ్జీవితమూ తృప్తినిచ్చును.

UMA Bracelets

UMA 826 Rs. 8/8/-
UMA 813 Rs. 8/-
UMA 825 Rs. 7/-

Gold Sheet Covered
Gives life long Satisfation
Catalogue free

వస్తువుల వి. పి. చార్జి రు. 1-2-0 మాత్రమే అగును. కావలసినవారికి కేటలాగు ఉచితం.

**ఉమా గోల్డు కవరింగు వర్క్సు, ఉమా మహల్ :: మచిలీపట్టణము**



Chandamama, October '51

Photo by R. Krishnan

మూడు మూర్తులు




రంగు వెయ్యండి (కథ) 4-వ బొమ్మ